# ANASUYA.

( *A Telugu Drama.* )



AUTHOR

CH. MANIKYA SARMA.





PATRON

M. R. RY.,
Y. NARAYANAMURTY
PANTULU GARU B. A., B. L,
ADVOCATE, NARSAPUR.

PUBLISHER

K. SESHACHARYULU.
HEAD-MASTER.
BOARD SCHOOL, NARSAPUR.

శ్రీ

# అనసూయ

— సతీమహిమ యను నాటిక —

గ్రంథకర్త.

## చక్రావధానుల మాణిక్యశర్మ

మహారాజశ్రీ యల్లమిల్లి నారాయణమూర్తి పంతులు

బి. ఏ., బి. ఎల్., అడ్వకేటుగారి

అనసూయ [illegible]



కొమాండూరి శేషాచార్యులు గారిచే

ప్రచురింపబడియె.

నర్సాపురం.

1932

 [ వెల రు 0—[illegible]—0

# విజ్ఞాపన.

నర్సాపుర శాలికా పాఠశాల 51 వ వార్షికోత్సవ సందర్భమున మా బాలికల విద్యాభివృద్ధియు, ఉత్సాహమును దేటపరచుటకు బహిష్కృతాలంకారములను బోధించుచు నీతిదాయకమగు నొక నాటిక రచించి యీయవలసినదిగా బ్రహ్మశ్రీ చక్రవధానుల మాణిక్యశర్మగారిని కోరితిని. వారు నాయందలి యభిమానమున నీయభినవ నాటిక వ్రాసియిచ్చినందులకు వారికి మనఃపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈనాటిక పాఠ్యగ్రంథముగా నుపయుక్తమగుటచే దీని నచ్చున ముద్రింపింప దలచిన మ॥రా॥రా॥ యఱ్ఱమిల్లి నారాయణ మూర్తి పంతులుగారు తన్మశ్రీణ్యై వలయు ధనసహాయము చేసినందున వారికి కృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచున్నాను.

ఈపుస్తకమునకు పీఠిక యభిప్రాయముల వ్రాసి యిచ్చిన సహృదయులకు నా నమస్కారములు. ఈ గ్రంథమును ముద్రణాలయమున స్ఖాలిత్యముల నందకుండ సరిగా దిద్దిన మ॥రా॥శ్రీ శిష్ట్లా వేంకటసుబ్బయ్య కవి గారి మణికి మనఃపూర్వక వందనములు. ఈ నాటిక పాఠకుల యాదరమును బడయగలదని విశ్వసించుచున్నాను.

ఇట్లు
కొ. శేషాచార్యులు.

శ్రీయుత యఱ్ఱమిల్లి నారాయణమూర్తి పంతులవారి మహోదార ప్రశంసనుగూర్చి శుభాశీషంబులు.

ఉ॥ కోయిలతృప్తి నందియును గోమలపల్లవకాంతిజూచియూ
హా!యనియాదరించినక్రియన్ సుగుణార్ణవుడెఱ్ఱమిల్లినా
రాయణమూర్తి ధీమణి, రసాకరరాఘవసత్కృతీసతీ
నాయకుడయ్యు, శేషగురునాథు,నభీష్టముదీర్పనెంచియా
తీయనిపల్కులొప్పెడు సతీమహిమన్ బ్రచురింపద్రవ్యసా
హాయముచేసి సద్యశము నందెను గావున నీమహాత్మునీ
ధ్యేయుకుటుంబమున్ సుఖగతిన్ జెలువార త్రిమూర్తు
[లున్ సదా
శ్రేయములన్ జిరాయువుల శ్రీలనొసంగియనుగ్రహించు
[తన్॥

ఇట్లు

గ్రంథకర్త.

చక్రావధానుల మాణిక్యశర్మ.

# పీఠిక.

1931 సం॥ డిశంబరు నెలలో నరసాపురం బోర్డు హిందూ బాలికాపాఠశాల యొక్క 51 వ వార్షికోత్సవము జరిగెను. ఆసందర్భమునందు ఆపాఠశాల బాలికలచే యీ నాటకము ప్రదర్శింపఁబడెను. నాటక ప్రదర్శనమును చూచినవారు బాగున్నదని మెచ్చుకొని అది గ్రంథరూపముగ నుండవలెనని కోరిరి.

పాఠశాల ప్రధానోపాధ్యాయులగు కొమాండూరి శేషాచార్యులుగారు దీనిని మ॥ రా॥ శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తి పంతులుగారి ధనసహాయముచే ముద్రించుచున్నారు.

ఆ వార్షికోత్సవమున నేను సభాధ్యక్షతను వహించినందున యీ పుస్తకమునకు పీఠిక వ్రాయుమని కోరినందున దీనిని వ్రాయుచున్నాను. బాలికలకు పాతివ్రత్యము మొదలైన సద్గుణములు తెలుపు యీ పురాణకథను బాలికలచే ప్రదర్శింపబడుటకు వీలుగా కవిగారగు మ॥ రా॥ శ్రీ చక్రావధానుల మాణిక్యశర్మగారు దీనిని వ్రాసియున్నారు. ఈ గ్రంథము నందలి గుణములు బాలికాపాఠశాలయందలి బాలికలకు సహితము సులభముగ తెలియగలవు. కాన యిక్కడ హెచ్చుగా చెప్పనవసరము లేదు.

కె. జి. బాబురావు.

డిస్ట్రిక్టు మునిసిపు

# OPINIONS.



నెక్కంటి దొరయ్యా చౌదరిగారు.
ప్రశిడెంటు, నర్సాపురం తాలూకాబోర్డు.

ఈ అనసూయ నాటకము నా యెదుట నర్సాపురం బోర్డు బాలికా పాఠశాల బాలికలచే ప్రదర్శింప బడినది. ఈపుస్తకము బాగుగా యున్నది. పతివ్రతా లక్షణములను బోధించుచున్నది. బాలికా పాఠశాలలకు దీనిని సప్లై చేయవచ్చును. ఈ పుస్తకము ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులు కొమాండూరి శేషాచార్య్యులుగారి కోరిక ప్రకారము మ॥ రా॥ శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తి పంతులుగారు అచ్చొత్తించుటకు పూనుకొన్నందున నేను చాల సంతోషించుచున్నాను. ఈ పుస్తకమును వ్రాసియిచ్చిన కవిగారికి నా మనః పూర్వక వందనములు.

నె॥ దొ॥

## MISS. K. GOPAL AIYAR, B. A., L. T.

*Sub Assistant Inspectress of Schools,*

ELLORE. Dated 24—5—32.

I have witnessed several times the play of 'Anasuya' acted by the girls of the Board Girls' School Narsapur. Its literature poetry and songs were all found to be most pleasing to the ears. The efforts and genius of the music teacher T. Upendraprasad added to its excellence. Its plot and moral tone are most fitting for the girls. But unfortunately such an excellent drama, has never been published, so it has been a long desire of the Head-master K. Seshacharyulu and his assistants, that this play should be published and circulated so that the girls all over. Andhra Desa may also enjoy its privileges.

As the play goes to the press, my sincere wishes go with it, that all those who hear it, should meditate on its moral tone and should not only preach but also practice its ideal of 'Pathi Bakthi' the ideal not merely of the present but of ancestral India.

I fully hope that the heads of schools for girls will all try their best to get copies of this useful drama.



RAO SAHEB R. NARAYANA IYENGAR A.V.L.

*Deputy Superintendent of Police.*

**NARSAPUR,**

Date 11—5—32.

I had the pleasure of witnessing the Drama 'Sati Anasuya' staged by the girl students of the Board Girls' School Narsapur on the Prize distribution day in December 1931.

The girls acted admirably well and all of them acquitted themselves creditably. It is really satisfactory to note that the Head-master Mr. K. Seshacharyulu and his assistants took such a keen interest in training up their pupils. The plot adopted in the above drama is instructive and elevating the moral character of woman-hood; a drama of this kind deserves to be encouraged in every girls' school.

శ్రీ

# అనసూయం

(నాంది)

శ్రీమాంగళ్యగుణాబ్ధిచంద్రికసతీశ్రేయోభిరూపంబుది
వ్యామోదప్రదభవ్యరత్నమనసూయాశశ్వదాధ్యాత్మవి
ద్యామూర్ధన్యము పాపభంజనములోకాలోకసంరక్షణ
స్థేమంబైయనవద్యమైన వరపాతివ్రత్యమున్గొల్చెదన్.

**సూత్రధారుఁడు**—(పుష్పాంజలి సదస్యులపైఁ జల్లి) ఓహో! ఈ రంగమంగళవిధానమెంత రమణీయముగనున్నది! సభయుఁ గవిజీవప్రముఖసంయమిసురసేవితమహేంద్రసభవోలెఁ గవిజీవపోషకులును సారస్వతావలంబకులును న్యాయమూర్తులును మహామండలీపరిపాలకులును న్యాయకళాపట్టభద్రులును గలిగి విరాజిల్లుచున్నదే! ఆహా! ఇమ్మహానీయులు మా నరసాపురబాలికాపాఠశాలయందెంతటి సమాదరణమును జూపుచున్నారు! బాలికలమగు మేమే దేని సతీధర్మగుణసౌరభమున నలరు రూపకమును బ్రయోగించి వీరల నానందపఱుపవలయునుగదా! (ప్రక్కకుఁ జూచి) భద్రా! రంగమంగళలతికా! ఒకసారి యిటురమ్మా?

నట—(ప్రవేశించి) ఆర్యా! ఇదే వచ్చితి నాజ్ఞయేదియో నిరూపింపుము.

సూత్ర—ప్రియురాల! ఈసదస్సును జూడుమా!

నటి—నాథా! చూచితినికాని దివ్యతేజస్సంభృతలైనయీ లీలాశరీరధారిణులెవ్వరు?

సూత్ర—కళ్యాణీ! ఆజలతారుపూవుల కుసుంబారంగు చీరగట్టిన యామె శ్రీయుత యెల్లమిల్లి నారాయణ మూర్తిగారు పరిగ్రహించిన ప్రసన్నరాఘవకృతీ సీమంతిని. ఆ మణినిబద్ధమైన యాకు పచ్చరంగు గల పట్టుపుట్టముఁగట్టిన తరుణి బ్రహ్మశ్రీ పొన్నపల్లి వీరరాఘవసోమయాజిగారు చేపట్టిన శకుంతలాకృతి సతీమణి.

నటి—జీవితేశ్వరా! ఎంతటిసుకృతము! నేఁడిట్టి వారల నానందపఱచుటకు శ్రీయుత చక్రావధానుల మాణిక్యశర్మగారు రచించిన ప్రేక్షణిక ముండిన బాగుండెడిదే!

సూత్ర—లేకేమి. నీకాసంశయమేల?

నటి—ఉన్నదా! శర్మగారిమధ్య ప్రతికూల దైవోపహతులైనారే! మనకెట్లు లభించినది?

సూత్ర—ఆధ్యాత్మికశక్తి సంపన్నులగుటచే మాణిక్యశర్మ గారు విచారమును మఱచి శ్రీమాన్ కొమాండూరి శేషాచార్యవేంకటార్య ప్రముఖమైన మనయుపాధ్యాయమండలిచే నర్థింపఁబడి యీసంవత్సరమునఁ

గూడఁ బారితోషిక ప్రదానసమయమునఁ బ్రయో
గించుటకు "అనసూయ" అను నాటికను రచించి
యొసఁగ మన దేశికులు మనశాలికలచే సద్దానినిఁ
జదివించియున్నారు.

నటి—ఓహో! అలాగునా! మాచెల్లెలిభారసాలమహో
త్సవమునకై నేను శ్రీనగరమునకఱిగిన దానవగు
టచే నేనాయంశము నెఱుంగను. అట్లయిన ఋతు
వర్ణనముం జేసెదను.

గీ॥ చంద్రుఁగనిసత్త్రియనసూయ సాధ్విమహిమ
స్త్రీప్రపంచంబుశోభచేఁ జెలఁగినట్టుల
అలవసంతునిమహిమఁ బుష్పాటవులును
సుఫలతేజోవిశేషవిస్ఫూర్తి వెలసె.

సూత్ర—బళిబళీ! సుప్రసిద్ధకథాంశము నిన్ను విదుషీమణిగఁ
జేసినది. మెచ్చితి రమ్మా. అల్లదే యతిమహర్షి లో
చనమరీచికలపైఁ బత్రికాంతికలదై క్షీరసముద్ర
ముపైఁ దన మనోనేత్రముంగూడఁ బ్రసారించి,
లేగవెంటఁ జనుగోవువలె ననసూయాదేవి వెన్నం
టి నడచుట కారంభించినది రమ్మిక నునసము
అనంతరకరణీయమునకై త్వరపడుదము.

నటి—(తెరవైపుచూచి) ఆహా! పుత్రప్రేమయందెంత మధు
రిమకలదు.

(ఇద్దరు నిష్క్రమించెదరు)

ఇది ప్రస్తావన.

# శ్రీ
# అనసూయ



## ప్రథమాంకము.

రంగము—అత్రిమహాశ్రమోపకంఠసీమ

అనసూయ ప్రవేశించును.

అనసూ—1. పాట

ఔరా! ఏమి నా నాథుని లోచనమరీచికలు!

మ॥ తొలుతన్ రాజితసూత్రమట్లుచని తోడ్తోమల్లెమొగ్గం[తమై|
పెలుచన్ బట్టెడువెన్నముద్దయయి, వేవేమంచుగోం[డంతమై|
యలవిద్యున్మయగోళమైనిలిచె క్షీరాబ్ధిన్ దిశల్ నిండు శ్రీ|
తలవాతామృతశీకరోల్బణకళా ధావళ్యమేపారఁగన్

అత్రి—(ప్రవేశించి) క్షీరాబ్ధిపై నేఁ బ్రవేశింపఁజేసిన నిరీక్షణకాంతులపై మోహంబున నీయనసూయ వాటి ననుసరించి చనుచున్నది. కానిమ్మేమి సేయునో విలోకించెదఁగాక.

అన—ఇదియేమో కడునద్భుతంబుగఁ దోఁచుచున్నది. కలహంసచేఁ ద్రుంపఁబడిన పొందమ్మితోఁబాటు

తన్మృణాళసూత్రముకూడఁ జనినట్లు నానాథుని
సృష్టి ప్రసారతేజంబు నాహృదయముకుఁ గూడ
నాకర్షించుకొని నన్నిటకు తోడితెచ్చినది. ఈతేజం
బున నాకింతటి యవ్యాజానురాగంబుదయించుట
కేమి హేతువో తెలియకున్నది. ఇప్పుడైన నాకు
రెక్కలేయుండిన నెగిరిపోయి యాతేజఃపుంజమును
ముద్దులాడకుందునా! అద్దానిని విలోకించుటకు
నాకిందు కాల్నిలుచుటలేదు. జాగైనను సరియే యా
పాలవెల్లికడకటిగి నా యానందఫలంబును గాంచె
దఁగాక. (ముందునకు నడచును)

అత్రి—భద్రా! అనసూయ! తాళుము. తాళుము.

2. పాట

అనసూ--ఓహో! జీవితేశ్వరుఁడు నన్నాజ్ఞాపించుచున్నాఁడు.
అక్కటా! ఎంతటివెఱ్ఱిపనిచేసితిని! పతియాజ్ఞఁ గొని
రావలయుననునూహయే లేకపోయినదే! నాథా!
ఇవే నావందనములు (నమస్కరించి) నాయపచార
మును మన్నింపుము.

అత్రి—అనసూయా! మన్నించుటకు నీవేమి యపచార
మొనర్చితివి?

అన—మీయాజ్ఞను గైకొనక యింతదూరమువచ్చుటయే
యపచారము. ఇంకేమి కావలయును!

అత్రి—సరియే! దానికిఁ బ్రత్యుత్తరమువల యొసంగదను
కాని నీవిప్పుడెచ్చటికేగుచున్నావు?

అన—ప్రాణేశ్వరా! అది యేమిమాయయో కాని మీరిపు
డాపయోరాశిపైఁ బఱపిన దృష్టిప్రసారము తొలుత
వెండితీగవలెఁ బయలువెడలి యంతట మల్లెమొగ్గం
తద్దై పిదప వెన్నముద్దంతద్దై క్రిచ్చఱహిమాచల
సామ్యమై వెంటనే దిక్చక్రము నాక్రమించి విద్యు
న్మయగోళమై చనుచు నాహృదయంబు నాకర్షించు
కొని పాలసంద్రింబునఁ బ్రవేశించినది. నేనద్దాని
ననుసరించి చనుచున్నదాన. ఆప్రేమ మతి విస్తారమ
గుటచే మీ యాజ్ఞనైనఁ గొనవలెనను బుద్ధి నాకు
లేకపోయినది. అందుచేతనే యపచారినిక్షమింపుడని
వేడితిని.

అత్రి—ఓహో! అలాగునా! సరియే క్షమించితిని. కాని

గీ॥ వత్సలనుగాంచియానందవార్ధిఁ దేలఁ
మగనియనుమతిలేదను మాటయేల!
భర్తవిమలాత్మతేజమే వసుధఁబుత్రి
రూపమునఁబుట్టునను వేద రూఢి వినవె!

అన—అది యటులే కావచ్చును. కాని నేనిపుడపత్యమును
జూడఁబోవుటలేదే!

అత్రి—ఏల లేకుండును? నీ వింతకుమున్న నా యనుష్ఠానము
పూర్తియైనసమయమున నా చెంతఁజేరి యేమంటివో
చెప్పుమా!

అన—ఏమంటిని! కశ్యపుని భార్య నాసోదరి యదితి దిన నాథుఁడైన సూర్యునిఁ బ్రసవించినది. ఆమె యెంతటి యదృష్టవతియో వింటిరా! యని యంటిని.

అత్రి—అందుచేతనే నీవిప్పుడు వత్సను చూడఁ జనుచున్నావని యంటిని.

అన—అదితివత్సయైన వివస్వంతునిఁజూడఁ జనుచున్నాననియా!

అత్రి—కాదు. నీవత్సను చూడఁ బోవుచున్నావనియే

అన—నావత్సనా? నావత్సను!

అత్రి—అవును నీవత్సనే నీవత్సను.

అన—ఏమీ! నాపుత్రునా!

అత్రి—అగును. నీపుత్రునే.

అన—ప్రాణేశ్వరా! నాకంతటి యదృష్టమా! నన్నూరక గేలిసేయుచున్నారు.

అత్రి—గేలిసేయుటలేదు. నిశ్చయముగ నీపుత్రునే చూడఁ బోవుచున్నావు. కనుకనే నీహృదయంబట్లు లాకర్షింపఁబడినది.

అన—ఆకర్షింపంబడినంతమాత్రమున నాతేజము నాకుఁ బుత్రప్రాప్తియగునా! నన్ను సందేహాడోలికపై నూచుచున్నారు.

అత్రి—భద్రా! సందేహింపకుము. నాచూడ్కులవలన బయల్వెడలిన తేజం బాపయోరాశియందుఁ బ్రవేశింపగనే పుత్త్రాకృతినిఁ దాల్చియున్నది. వాని యుద్భవమువలన నామావశేషమైన తరుగుల్మలతా ప్రకృతియంతయు మరల ననలచే నవనవోన్మేష మైనది. చూడుము.

చ॥ చిగురులులేక మ్రోళ్లయిన చెట్లు చిగిర్చెనురూపుమాసిపో
యినలతలెల్ల ధారుణిపయిన్ గడుసొంపుగ మొల్కలెత్తెనో
వనితరో! నాదుతేజమటు పాల్కడలిన్ సకలోషధీశుఁడై
జననముఁగాంచియుండ మది సంశయమందకనమ్ము నానుడిన్‌।

అందువలననే నీకుఁ బుత్త్రలాభంబును దెలిపితిని.

అన—ఆహా! మహాత్ములమహిమలు ప్రశంసనీయములు కదా! నాయానందవారాశికిపుడు పోటు తగిలినది.

3 పాట

జగదీశ్వరా! నాకిపుడు మరింతయారాటమధికమైనది.

అత్రి—ఏమీ! కుమారు నెప్పుడు తిలకించి యానందింతునా యనియా?

అన—ఆర్యులకుఁ దెలియని దేది? (తలవంచుకొనును)

అత్రి—భద్రా! సిగ్గునందవలదు. నీయభీష్టమిప్పుడే ఫలింపఁ గలదు. ఆవైపు చూడుమా!

అన—(చూచి) నాథా! ఆవచ్చు వృద్ధతపోనిధి యెవ్వఁడు? వానివెంటవచ్చు నాబాలుండెవ్వఁడు? ఆహా! ఆ బాలుఁడెంత జగన్మోహనముగనున్న వాఁడు!

అత్రి—ఆతపోనిధియే పరమేష్ఠి. వానివెంటవచ్చు బాలుఁడే నీముద్దుల కొమరుండు.

అన—నాకొమరుఁడా! ఆహా! ఎంతటియదృష్టము! నాకన్నులకుఁ గర్పూరాంజనము వ్రాసినట్లున్న దే.

(బ్రహ్మ చంద్రునితోఁ బ్రవేశించును)

బ్రహ్మ—వత్సా! నీతల్లితండ్రులగు నీయనసూయాత్రి దంపతులకు నమస్కరింపుము.

చంద్రు—పూజ్యులగు మాతాపితరులకు వందనసహస్రములాచరించు చున్నాఁడను.

అత్రి—వత్సా! దీర్ఘాయుష్మంతుఁడవగుము.

అన—బిడ్డా! చిరంజీవివై దేవహితంబునకుఁ బాత్రుఁడవగుము. (చేరఁదీసికొని)

శా॥ రారా! నావరపుత్ర! శీతకరసాంద్రా! కౌగిలీరా! (కౌగిలించి) [అహా!

ఈరమ్యాంగమృదూపగూహన సుఖంబేమందు శ్రీచం [ద్రా

సార శ్రీమఱపించె ముద్దిడుము వత్సా! (ముద్దాడి) హాయి [హాయి యెంతతీ

పౌరా! యిక్షురసంబు ద్రాక్షరస మేలా! దీనికింజాలునే!

కుమారా! నీ పేరేమోయి!

చంద్రు—చంద్రుఁడు

అన—నీకీపేరెవరుంచినారు?

చంద్రు—పరమేష్ఠి

అన—మహాభాగ్యము. జన్మించగనే బ్రహ్మ కరుణకుఁ బాత్రుఁడవైతివి.

అత్రి—మహాత్మా! పరమేష్ఠీ! బీజన్యాసము సేయుటకుమాత్రముహాలికుఁడు కర్తయగుంగాని పోషించువాఁడవు నీవుకదా! నీకరుణచే మాదంపతులము పుత్రునిఁ గనని వారమైతిమి.

4 పాట

బ్రహ్మ—అత్రిమహర్షీ! మత్సముఁడవైననీవునన్నింతపొగడవలదు. జగత్సృష్టికిఁ గారణభూతులైన నవబ్రహ్మలలో నీవొకండవు. మఱియు నీ తేజం బావిధమున బయల్వెడలి నిజశీతలకాంతులచే జగంబుల నాక్రమించి పయోరాశియందుఁ బ్రవేశించి నీసంకల్పమునం జేసి యీకుమారరూపముదాల్చినది. వీనికిఁ జంద్రనామధేయము సమంజసమని యుంచితి నీతని జన్మవలన నోషధులు చిగురించుటచే నోషధీశుండనంబఱఁగు. మఱియు నదితి తనూభవుండైన యాదిత్యుఁడు దివ్యులయానతి దిననాథసామ్రాజ్యము

నకుఁ భట్టభద్రుం డైనటులే యీచంద్రునకును
శర్వరీసామ్రాజ్య మొసంగఁదలఁచినీయనుమతిఁబడసి
కొంపోవవచ్చితి నేమందువు?

అన—ఇప్పుడే నాబిడ్డకు సామ్రాజ్యాధికారమా!

అత్రి—వాణీవల్లభా! విద్యావాసనలేని యీయర్భకుండం
దులకు దక్షుఁడగునా!

బహ్మ—అత్రిమహర్షీ! సందియమేల? దక్షుఁడే

అత్రి—మహాభాగ్యము పరమేష్ఠీ! ఈకుమారుని మీయధీ
నముఁ జేసితిని.

అన—(చంద్రునక్కునఁజేర్చి) నాయనా! నాముద్దులయ్యా!
చంద్రా!

చం॥ కమలభవాజ్ఞశర్వరికిఁగాంతుఁడవయ్యెదవంచు మో
[దసం
భ్రమములఁగ్రాంతునా! కళల రాజిలుమోమునుము
[ద్దులాడు భా
గ్యమునకుదూరమాదును కదా! యనికుందుదునా!
[కుమారచం
ద్రమ!కలలోనిలీలలవిధంబుననయ్యెనె! నీదుముచ్చటల్

అత్రి—భద్రా! కుమారుఁడున్నతపదంబున కధినాథుండగు
సమయమున నీవిట్లు వగవరాదు. సంతోషమున
వత్సను పరమేష్ఠికి సమర్పింపుము.

అన—లోకేశా! ఇదే వత్సను మీ చరణకమలముల కర్పించితిని. వీనిని సర్వవిధముల రక్షునిగఁ జేసి రక్షించుభారము మీ మది.

5 పాట

బ్రహ్మ—అమ్మా! అనసూయాదేవీ! నీకుమారచంద్రుఁడు సర్వసమర్థుఁడు దూరంగతుఁడయ్యెను మీ కేశాక సర్వలోకములకును నానందకరుఁడై తన యమృత కిరణములచే సందఱఁ దనియించుచుండును. మీరు ను మీకుమారు నభిషేకమహోత్సవమునకు రా వలయును.

అన—మహాభాగ్యము మాకింతకంటెఁ గావలసిన దేమి! అక్లేవచ్ఛేదము.

(అందరు నిష్క్రమించెదరు)

## 2 వ రంగము—ఆశ్రమము.

(అత్రియు ననసూయయుఁ బ్రవేశింతురు)

అత్రి—అక్కటా! కుమారచంద్రుఁడు శర్వరీసామ్రాజ్య మునకు నభిషేకింపఁబడినవాఁడని సంతసింతునా! అర్ధాంగి గర్భంగతపరితాపముచే బాధనందుచు న్నదని సంతాపింతునా!

అన—6 పాట

అక్కటా! ఈ హృదయాంగతపరితాపము నేనెట్లు

సహింతును దైవమా!

మ॥ ఎవియో! ప్రాణులు రెండు నా జఠరమం దెంతో విజృం
[భించి క్రో।
ధవివాదంబునఁబోరుచున్న క్రియసంతాపంబుతోఁ బెంచెనీ।
పవిఘాతంబులఁబోలు దెబ్బలకు నోర్వంజాలఁ జాలించెఁ బ్రా।
ణవిభూ! ప్రోవవె! నీతపోస్త్రమున మాన్పంజూడ వేయూ
[వ్యధల్॥

అత్రి—ప్రియురాలా! ఇంచుక నేపోర్చుకొనుము. నయనేంద్రియములఁ దెలిసికొనఁజాలని యీయంశ మాత్మదృక్కులచేఁ దెలియంబడఁగలదు. అంతవఱకు నెట్టులో సద్దుసేయక సైరించుము. (ధ్యానించి) ఆ! తెలిసినది. నీగర్భమున నేటికేడుదినంబులనాఁడు ప్రవేశించిన యీశ్వరతేజమును విధ్వంసముసేయ హైహయుఁడొక దారుణాస్త్రమును బ్రయోగించినాఁడు. నీగర్భస్థశివతేజంబు విజ్ఞానమైనదగుటచేఁ దానితోఁ బోరుచున్నది. నేనిప్పుడే రుద్రానువాకంబులఁ బఠించి యావైరిశస్త్రమును సంహరించునంతటిశక్తి యీ శివతేజోమయమైన పిండమునకొసంగెదను. నీవంతవఱకాశ్రమముననున్న యజిన

శయ్యపైఁ బవ్వళింపుము. ఓపికఁబట్టుము. రమ్ము లోపలకు. (అనసూయను లోనికిఁగొంపోయి విడిచి వచ్చును)

7 పాట-ధన్యాసి-ఆది

ఓమ్‌నమశ్శంభవేభవాయచఓమ్‌నమశ్శివాయహరయే
[ఓమ్‌నమశ్శంభవే॥
ఓమ్‌హ్రీంనమశ్శివాయమన్యవే ఓమ్‌శంకరాయశివతరా
[యచ॥ ఓమ్॥
సకలశత్రుభయనివారణాయ శర్వాయశ్రితపోషణపరా
[య శాంతాయగుణా
తీతాయ మహేశాయసాంబాయపశుపతయేచ॥ ఓమ్॥

(తెరలో) అభయోస్తు! అభయోస్తు! భద్రమస్తు!
ఆహా! భగవంతుండు మామహేశ్వరుం డభయంబొసంగి నాఁడు. అనసూయ బాధను దొలంగించి పుత్రవతిగఁ జేసియుండును.

(అనసూయ దూర్వాసునితోఁ బ్రవేశించును)

దూర్వా—తండ్రీ! నమస్కారము. నీ రుద్రానుష్ఠానపఠన మాహాత్మ్యంబునం జేసి వైరిశస్త్రమును సంహరించు నంతటిశక్తిని శివుండొసంగియుంటచే విజయముం గాంచి యుద్భవించితి. శివుండు ప్రసన్నుండై నాకు దూర్వాసనామకరణముం జేసియంతర్హితుండైనాఁడు.

అత్రి—కుమారా! దూర్వాసా! మహేశ్వరునికరుణచే విప
దబ్ధినుండి బయల్పడితివా! నీవపరశివుండవై వర్ధి
ల్లుదువుగాత. నీతల్లి మిమ్ముల నలసియున్నది. ఆశ్రిమ
ములోనికరుగుదము రమ్ము.

దూర్వా—అట్లేచేయుదుము. కాని పరమశాంతిస్వరూపు
లగు తమకును విరోధులుకలరా!

అత్రి—గీ॥ జగతికానందకరుఁడైనచంద్రుగాంచి
తస్కరులుశాత్రివుండని తలఁచునట్లె
మానవాచరణీయధర్మములను గని
హృదయశల్యములుగఁగ్రూరు లెదఁదలంత్రు॥

కావున నాస్మృతిధర్మములు హైహయరాజులస్వేచ్ఛా
దుష్ప్రవృత్తులకు వెనుపోటుగనుండుటచే నాయందలిమత్స
రంబున శాపభీతిచే నామీఁదకురాక గర్భస్థుఁడవైన
నీమీఁదఁ గనఁబఱచినారు.

దూర్వా—చిత్తము. అసమర్థుల ప్రవృత్తులట్లేయుండును.

(ఇద్దరు నిష్క్రిమించెదరు.)



శ్రీ

# అనసూయ

## ద్వితీయాంకము.

రంగము:-వనాంతరము-నారద ప్రవేశము.

నారద—8 పాట

ఆహా! సతీమహిమయన నేమోయనుకొంటిని. బ్రహ్మ నిర్ణయమునకుఁగూడఁ బ్రతిక్రియఁ జేయఁ జాలును కదా!

గీ॥ దారుణక్షామమునఁ బ్రజ తల్లడిల్ల
నన్నపానంబులనుఁ దన యాత్మశక్తి
గల్పనముఁజేసి జనులను గాచెనంట
పృథ్వి ననసూయఁబోలిన సాధ్వి కలదె?

అట్టిమహిమను బ్రతీసతియుఁ బతిభక్తిమాత్రంబునంజేసి సంపాదింపఁగలదు. కాని అట్టి సద్గుణములు కల్గియుండుట దుర్లభము. అహంకారముననో విసుఁగుదలనో దురభిమానముననో చనువిచ్చిన గర్వాంధకారముననో. యేదో యొక విధమునఁ బతికిఁ బ్రతికూలించని స్త్రీలు సాధారణముగ నుండరు. నిక్కముగ మనోవాక్కాయ కర్మలచే భర్త

దుర్గుణుండైనను వ్యతిరేకింపక సువ్రతయై ప్రవర్తించినచో
ననసూయామహాసాధ్వివలె మహామహిమాన్వితయై జగం
బులకుఁ బ్రతిజగంబులు సృష్టిఁ జేయకుండునా!

(తెరలో) హా! రక్షింపుడు. రక్షింపుడు.

ఎవరు చెప్పుమా! ఈ రక్షింపుమనువారు? స్త్రీకం
ఠమువలె వినవచ్చుచున్నదే!

గంగ—(ప్రవేశించి) హా! రక్షించుము. నారద మునీంద్రా!
రక్షించుము.

నార—భయములేదు. నీవెవ్వతెవు? నీవెవ్వనినుండిరక్షింపఁ
గోరుచున్నావు.

గంగ—నేను గంగను. అల్లదే చూడుమా! (వెనుకకుఁ
జూపి) ఆ మహాపాపులు నాసలిలంబులఁ గృతస్నా
తులై తమకిల్బిషంబుల నాయందు సంక్రమింపఁ
జేయఁ జూచుచున్నారు. అందుచే వారల వారించి
నన్ను రక్షించువారికై యిటు వచ్చుచున్నాను.
వేగరక్షింపుము.

నార—గంగాదేవీ! సమస్తపాపంబులఁబటాపంచలుసేయఁ
జాలిన నీవేయిట్లు భయభ్రాంతవై యన్యరక్షణముఁ
గోరుచుంటివే! నీవు నిక్కముగ గంగవా ఏమి?

గంగ—నారదా! నేను నిశ్చయముగ జాహ్నవినే. వీరొన
ర్చిన మహాపాపములతిదారుణములు. ఇంతకుమున్ను

ప్రవర్తిల్లిన దారుణక్షామాడంబరమున వీరు గాతు
సులవలె మహర్షులఁబట్టి వధించి భక్షించినారు.
సర్వవిదులైన సంయములే యిట్టి హింసలకుఁ బాల్ప
డినప్పు డట్టి యఘంబులు నన్నుఁగూడ ఖలముఁ
జేయఁగలవు. కావునరక్షణము గోఁబవలసివచ్చినది.

నార— అట్లయిన మహాపతివ్రతాతిలకమైన యనసూయా
దేవిసన్నిధికరిగితి వేని వారలపాపంబులువోకార్చి నీ
కభయదానంబొసంగఁగలదు. వేగ చనుము.

గంగ—'అయ్యో నారదా!

చం॥ తిరిగితినాశ్రమావళుల దేవనిగాఁగఁబతివ్రతాళినే।
తరుణియుఁబాపులనేడపి తప్పకనన్ను సముద్ధరింతునం।
చురవడిఁబల్కనొక్కసతి యుఁగనరాదిక నేమిసేతును
ర్వ్వరపయినాసమానలల స్వర్గపురంధ్రులనాశ్రయించెదన్

విశ్వంభరలో నన్నుద్ధరించువారుందురని నాకు విశ్వాసము
లేదు. ఇంతవఱకనేకుల నభయంబుఁగోరి వ్యర్థురాల నైతిని
పార్వతీ లక్ష్మీ సరస్వతుల సన్నిధి కరిగినఁగాని నా యార్తి
తీరదు.

నార—అట్లయిన నీవింకను తిప్పలు పడవలసి యున్నది.
చనుము.

గంగ—అరుగో పాపులు సమీపించుచున్నారు. నేనేగెద
(నిష్క్రమించును.)

[పాపులు ప్రవేశించెదరు.]

పాపు—ఓరీ! బడుగువాఁడా? ఈ మార్గమున గంగవచ్చి నది యెందుఁ బోయినది!

నార—ఆహా! ఇట్టి కొండగుట్టలమీఁదికే గంగ వచ్చిన నిఁక పాడిపంటల కేమికొదువ! పృథ్వి రత్నగర్భ యనుమాట సార్థకముఁ జేసికొనదా!

2 పాపు—ఓరీమూర్ఖా! జలమనుకొంటివా యేమి? గంగా దేవి స్త్రీరూపమును ధరించి పాఱిపోవుచున్న దామెను మేమడుగునది.

నార—ఓహో! అలాగునా! కొంచెము నూనూగు మీస కట్టు మొలకెత్తుచున్న యానవాలు కనుపట్టుచుం డుటచే మగవాఁడేమోయని సందేహించితిని కాని యా వ్యక్తి యాఁడుదియే కావచ్చును. వస్త్రధారణ విధానముకూడ నాడుది యనియే తోఁపించుచు న్నది. ఎట్లైన నందకత్తెయే. మీకామెతోఁ బని యేమున్నది.

3 పాపు—ఆ ప్రశంస నీకేల.

నార—అది రహస్యము కాఁబోలునేమి.

1 పాపు—అవును. రహస్యమే.

నా—రఅట్లయినమీరామెను కామించియుందురు కాఁబోలు.

2 పాపు—అవును. కామించియే యడుగుచుంటిమి.

నార—మీవంటి యందకాండ్రు కామించినప్పుడా జడ స్వభావురాలు వట్టి వెఱ్ఱిదికాఁబోలు పలుగువెట్టి పారిపోవుటకు.

3 పాపు— అదంతయు నీకెందులకులే. ఆమె యేగినదారి చెప్పుము.

నార—దారి చెప్పెదనులే గోదారి. అయిన మీరు మగవారే. ఆ యాఁడుదాని నింతవఱకు రానిచ్చుట సిగ్గు కాదా!

1 పాపు—ఆమె దివ్యగతిని పోవుచున్నది. మనుష్యగతిని మేము వచ్చుచుండుటచేఁ గలసికొన లేకున్నాము. ఎట్లుపోయినదో తెల్పుము.

నార—తెలుపుట కేమున్నది! అదే గోదారి. పొండు.

(పాపులు నిష్క్రమించెదరు.)

అనసూయాదేవి మహిమను జూచినది మొదలు సతీమణుల మహిమల నెల్లఁ దులఁదూచవలయునని బుద్ధికలిగిన నాకీ గంగాదేవి సహకారిణియని తలంచెదను. ఈ పాపుల రాపిడిచే గంగ స్వర్గముఁజేఱుట కాలస్యమగును. నేనీమెకంటె ముందుగ రమావాణీ పార్వతుల చెంతకఱిగి వారి మహిమలఁ దులయందుంచి తూచుట కారంభించెదను గాక.

(నిష్క్రమించును.)

రంగము—సత్యలోకము.

[లక్ష్మి సరస్వతీ పార్వతుల ప్రవేశము.]

సరస్వ—9 పాట

లక్ష్మిపార్వతులారా! నాయందలి యనురాగంబున
మీ రిరువురు నన్నుఁ జూడవచ్చినందుల కానం
దించితిని.

చం. పతులనుకూలురైనడచు వారలెమీారునుభర్తలందును
వ్రతులయివారిసేవల నిరంతరముఁ బరితృప్తి సేతురే!
కుతుకముతోడ సౌఖ్యమునకుఁ గొఱలేక చరింతురేజగ
త్త్రితయమునఁ బతివ్రతలఁ దెల్పెడుచో మన మేక దాయిఁకన్.

లక్ష్మి—సరస్వతీ!

సీ॥ అనుకూల వర్తనుఁడగుటనేకదె! బ్రహ్మ
నినునోటఁదగిలించుకొని చరించు
నను నిండు ప్రేమచేత నెకదా! శౌరి వ
క్షోంచితపీఠి నెక్కించుకొనియె
పార్వతి స్వప్రాణి పదమనికాదె! యీా
శ్వరుఁడర్ధదేహ మొసంగి మనుట
త్రిజగదాధార ప్రకృతి కాంతలము మన
పై భక్తిచూపని వారుకలరె

గీ॥ కావునను స్రష్టయును హరి కాలగళుఁడు
మనకు నున్నత పదసమర్పణముఁ జేసి
గౌరవించుచు మనశ్శక్తి కలిమిగొనుచు
తాము సత్కీర్తిఁగాంచుచుఁ దనియుచుంద్రు.

పార్వ—లక్ష్మీ సరస్వతులారా!

చం. ఎదియెటులైననఁగానిమనమే త్రిజగంబుల జీవకోట్లకా
స్పదలమెయైననఁగాని మనవాక్కులతో మనవంటిశక్తిసం
పద కలవారు లేరనుట భావ్యము కాదు మహోన్నతస్థితిన్
బొదలఁగఁగోరువారుసతమున్వినయంబుననుంట మేలగున్.

సరస్వ—అవునులెండి! ఇందు మనము ముగ్గురమే కనుక
సంభాషించుకొంటిమి. మేమే పతివ్రతలమని పరుల
చెంతఁ బ్రస్తాపింతుమాఏమి?

(తెరలో) గానము.

లక్ష్మి—అదుగో నారదుఁడు కాఁబోలు వచ్చుచున్నాఁడు.

పార్వ—ఈతఁడు కలహాశనుఁడగుటచే నెవ్వడేతంత్రమునుఁ
బన్నునోయని నామనంబు శంకించుచుండును.

నార—(ప్రవేశించి) పతివ్రతామతల్లులారా! త్రిశక్తులారా!
మీకు నారదుఁడు నమస్కరించుచున్నాఁడు.

అందరు—నిరంతర భగవన్నామస్మరణ జీవనుఁడవై సుఖిం
చెదవుగాక.

సరస్వ—నారదా! ఆ పీఠమునఁ గూరుచుండుము.

నారద—తల్లులారా! మీరు ముగ్గురును శక్తిత్రియము.
మీ సన్నిధినిఁగూరుచుండుటకు భయమగునుకదా?

సర—ఏమి నారదా! భక్తికవచ ధారివైననీకునుభయమా?

నార—ఏల భయములేకుండును.

శా. మీమీలీలలస్వీకరించియెకదా మీభర్తలీస్సృష్టి వి
[స్రమునసంహారక్రియాశక్తినెం
తోమోదంబునఁ గాంచియుండిరి భవద్దుర్వార మాహా
[త్మ్యముల్
సామాన్యంబులె తల్లులార! జగతీసంరక్షకంబుల్ కదా॥

లక్ష్మి—నారదా! నేఁడు మఱందాగనే స్తోత్రము ప్రారంభిం
చితివే! ఏమి కారణము!

నార—నిజము వచించుటకును కారణములు కావలయునా!
నా నుడులు మిథ్యాస్తోత్రములనియే తలంచితిరా!
మీరు జగదీశ్వరులు కారా! నిజము పలుకుడు!

లక్ష్మి—నీమాటలయందతిశయోక్తి లేదుకాని నీ స్వభా
వమునుబట్టి శంకింపఁవలసి వచ్చినది. మేము జగ
న్మాతలము, విశ్వకారణులమయినమాట సత్యమే

సరస్వ—నా సంబంధమ్మైన ప్రకృతి లీలలను స్వీకరించియే
నాపతి పరమేష్ఠి జీవకోటుల సృష్టించుటంజేసి నన్నుఁ
దన వదన మండలమున నలంకరించుకొనినాఁడు.

లక్ష్మి—నా సిరుల నొసంగియే జగంబులఁ బోషించుటం
జేసి నా వల్లభుండు శ్రీహరి నన్నుఁ దన వక్షస్థల
మ్మున నిల్పుకొని యున్నాఁడు.

పార్వ—నా శక్తివలననే రుద్రుండు సంహారక్రియా సామ
ర్థ్యము నందియుంటచే మెచ్చి నాకుఁ దనయర్థ
దేహమునే యొసంగినాఁడు.

నార—(నవ్వి తనలో) బళిబళీ! ఇప్పటికిఁ ద్రోవలోనికి వచ్చినారు. (ప్రకాశముగా) అమ్మలారా! అంతియే కాని నేను మిమ్ము మిథ్యాస్తోత్రముంజేసి కొండ నెక్కించలేదుకద!

సరస్వ—లేదు. వాస్తవమునే వక్కాణించితివి. అండబద్ధమేమున్నది. నేనే ప్రతీవ్యక్తి జిహ్వాగ్రమునను నిల్చి మాట్లాడించుచుందును. నా వాగ్లీల లేనివాఁడు మూగవాఁడగును. కావునఁ బ్రతీవ్యక్తికిని నేనే యాధారభూతురాలను. నాసహాయములేక బ్రతుకనే లేరు.

నార—(స్వగతం) ఈమె యిప్పుడు మహాగర్వ శిఖరిశిఖరాగ్రమున నధివసించినది. (ప్రకాశముగా) అవునమ్మా నిజము పలికితివి.

లక్ష్మి—సరస్వతీ! అట్లనకుము. నిజముగ మూగవాఁడైనను నా యనుగ్రహము కలిగియున్నచోఁ బ్రతుకఁగలఁడుసుమి!

నార—ఈమాటయు సత్యమే. ద్రవ్యసహాయమున్నఁ గొండలేకడలి ప్రయాణములు సేయఁగలవు.

పార్వ—లక్ష్మి సరస్వతులారా! మీమీ శక్తులమాటయెట్లున్నను నా ప్రభావమునఁగాని తొలుత వ్యక్తులకుఁ జైతన్య శక్తులే కలుగవు. చైతన్యముకలిగినఁ గదా! జీవి పలుకుటయు, బ్రతుకుటయును.

నారద—(స్వ) వహ్వా! ఒకరికంటె నొకరికి వీరావేశము లధికము లగుచున్నవి. మంతనములకు దిగుచున్నారు. (ప్ర) అమ్మ పార్వతి వచించిన మాట యందు సత్యలక్షణమున్న మాటయు నిజమే.

సరస్వ.—నారదా! ఇచ్చకములాడుచున్నావు. తొలుత నా పతి బ్రహ్మ జీవుల సృష్టిఁజేసినపిమ్మటఁగదా! చైతన్యశక్తికి సామర్థ్యము కలుగుట! సృష్టియే లేకున్న చైతన్యమున కేది గతియో!

పార్వ—వాణీ! నా చైతన్యశక్తి లేకున్న నీమగఁడు చేసిన మట్టిబొమ్మ లెందుల కుపయోగించును. మట్టిబొమ్మ లెంతయుపయోగమో యెఱుఁగవా!

లక్ష్మి—పార్వతీ! నీ శక్తివలన వ్యక్తికిఁజైతన్యముకలిగినను సరస్వతి మహిమచే భాషనేర్చినను ఆవ్యక్తికినా సిరులు లేకున్న వ్యర్థము. నిజమేనా నారదా!

నారద—నిజమేనమ్మా! అన్నియునిజములే

సరస్వ—లక్ష్మి! నాభర్తసృష్టియే చేయకున్న నీ ధనమునకు స్థానమేదీ?

పార్వ—నామహిమలేక కదలని బొమ్మకచికలకు విద్యలేల? విభవములేల?

సరస్వ—అట్లైన సృష్టి నాపివేయించెదను.(చేయిసాచును)

లక్ష్మి—నేను నా సంపల్లీల నుపసంహరించెదను.

(చేయిసాచును.)

పార్వ—నేను నా చైతన్యశక్తి నుజ్జగించెదను (చేయిసాచును)

నార—(తనలో) ఈచిరుతపోరు నాకిప్పు డుపాహారముల విందొనర్చినట్లున్నది. (పై) త్రిశక్తులారా! తాళుడు. తాళుడు. శాంతించుడు.

10 పాట

మీరు ముప్వురు నాయా శక్తులయందసమానులైన మాట సత్యమే. మఱియు

సీ॥ మట్టిలేకుండఁ గుమ్మరి కుండలను జేయ
సాధ్యంబుకల్గునే సాధ్వులార
అదియున్న నీళ్లుపోయక మెత్తవడి గూట
మున నాకృతినిఁజేయఁ బోలునమ్మ
చేసిననది యగ్నిచేఁ దప్తతను జెంద
కుండంగఁ జిట్లక యుండునమ్మ
ఈమూటిలోపల నేదిలేకుండిన
భాండమ్ములకు శక్తి వరలునమ్మ
గీ॥ కాన మీముప్వురును త్రిలోకముల జీవ
కోట్లకుఁ బ్రధానభూతలై కొలుచుండు
రిందునెవ్వరులేకున్న నెట్టి ప్రాణి
కిని బ్రతుకులేదు మీకేల కినుక తల్లి॥!

కావునఁ బ్రశాంతించుడు. త్రిమూర్తుల రాణులైన మీకిట్టి దురభిమానము కలదన్న నాకు సిగ్గగుచున్నది.

సరస్వ—నారదా! నీ యుపన్యాస సలిలమందెంతటి చల్లదన మున్నదయ్యా! మా కోపాగ్ను లింతలోఁ జల్లారినవి.

లక్ష్మి—తపస్సంపన్నతయు భక్తిపరవియే కాక నారదుని వచనరచన యుక్తియుక్తమైనది.

నార—అది నా తెలివి కాదు. సరస్వతి యనుగ్రహమున నా వచనముల నట్టి రచన కలిగి యుండవచ్చును. కాని—

సరస్వ—అదేమి నారదా! కానీ—అని దీర్ఘప్లుతముగఁ బలికితివి.

నార—మరేమియు లేదమ్మా సరస్వతీ!

గీ॥ నీకరుణ విద్యనెవ్వఁడు నేర్చు వాని
నంటదీలచ్చి పెద్దమ్మ యావహించు

లక్ష్మి—(నవ్వి) నారదా! విద్వాంసుఁడగుటచేతనా! నేను వానిఁ జేరకుండుట!

నార—గీ॥ కాదు కోడలు వసియించుకడ మెలఁగుట
నత్తగారికి గౌరవ హానియనియె॥

లక్ష్మి—అట్లు కాదు. వారివారి సుకృతముల ననుసరించి చేరుచుందును. మఱల మాలోఁ దగవులఁ బెట్టకుము.

నార—చేరుచుందువులే. అయిన నీ యనుగ్రహ మున్నచోటమాత్రము సామాన్యముగ నుందునా! ఇందిరా!

చ. సిరికలుగంగ వాని యడుచేతికిఁ బంక్తులనించుఁగన్నులా
శిరములకెక్కు నంధతయుఁ జేకురు గౌరవహానికోర్చుము
ష్కరమున దూరుసజ్జనులజంకడుదబ్బఱలన్నఁ బ్రాణముల్
దోఁచుకొనుటకోర్పుగానియొకదుష్టనుధర్మము సేయ డెన్నడున్

పార్వ—సరిపోయినది నారదా! అజ్ఞానుల ప్రవర్తనము లా
దర్శకములా

నారద—నేఁ జెప్పుమఱచితిని. అట్టి యజ్ఞానమునకుఁగూడ
మూలకంద మూ ధనమేకదా! పెదతల్లీ! నీవుమా
త్రము మూడులోకముల నొక్కముద్దగా మ్రింగఁజాలు
సంహారకారిణివి కావా! మీరు ముగ్గురును సంక
ల్పసిద్ధురాండ్రు. పంచభూతములును మీ వశము
మీరేమి చేయఁదలఁచినను జేయఁగలరు.

పార్వ—అగును. తప్పక చేయఁగలము.

లక్ష్మి—ఆ!. నిస్సందేహముగ.

సరస్వ—తలంచినంతపనియుఁ జేసి తీరెదము.

నార—అమ్మలార! ఇక్కడికి నా కోరిక ఫలించినట్లె నా
కడుపు నిండఁగలదు.

సరస్వ—అదేమికోరిక నారదా!

నారద—ఎంతో కష్టమైనపని కాదమ్మా! ఇవే చూచితి
రా యీ గులకరాళ్లు (రాళ్లనుచూపి) వీటిని శన
గలవలె వేయించి పెట్టితిరా! పటపటనమిలి కమ్మ
గ భక్షించెదను.

లక్ష్మి—అదేమి నారదా! రాళ్లు శనగ లగునా! వేయిం
చుటకు!

సరస్వ—అది మస్వార్థమైనపని.

పార్వ—నారదుఁడు విదూషకత్వము నేర్చినాఁడు.

నారద—విదూషకత్వము కాదమ్మా. నిక్కమే వచించి
తిని. నాకీమధ్య గర్భమున శూలరోగము జనించి
నది. రాళ్లు శనగలవలె వేయించి భక్షించినఁ గుదు
రునని అశ్వినీదేవతలు చెప్పుటచే వీటిని మూట
గట్టుకొని వచ్చితి నికార్యమును మహాపతివ్రతలు
తమ సాధ్వీత్వమునఁగాని చేయఁజాలరని తొలుత
వారే చెప్పియున్నారు. స్త్రీ యాశ్రమమును దిసు
గలేక పాతివ్రత్య మాహాత్మ్యము గలిగిన శక్తిత్రి
యము సన్నిధికే యరిగినఁ గొనసాగునని మీసన్ని
ధికే యిటు వచ్చితిని. వేగ వేయించి పెట్టుఁడు.
అపుడే శూలవచ్చు వేళ యగుచున్నది.

సరస్వ—మీవుల వేచినఁ జిల్లి భస్మమగునుగాని చణకము
లెట్లగును నారదా రాళ్లు!

లక్ష్మి—రాళ్లను శనగలవలె వేయించు గారడీపని పాతి
వ్రత్యమువలన సాధ్యపడునా!

పార్వ—నారదునిమాట స్థూలకాయుని తేలుమంత్రము
వేయుమనినట్లున్నది.

నార—తల్లులారా! ఇంతకు ముందేకదా! మే మెట్టికార్య మ్మునైనఁ జేయఁగలమని ప్రగల్భము లాడితిరి! అక్కటా నా కోరిక మీ మహిమలతోఁ బాటు వ్యర్థమయ్యెనుగదా! నాకేది దారి! అక్కటా! ఈ శూలబాధ నందుచుఁ దపింపలేక యే గోదావరి యందో గంగయందో పడి చత్తునన్న నానదు లిక్కడికైన రాకయున్నవికదా!

(తెరలో) హా త్రిశక్తులార! రక్షించుడు! రక్షించుడు!

సరస్వ—ఆ ఆర్తధ్వని యెవ్వరిదోకదా!

నార—ఎవ్వరిదైననేమి. నా పని యెట్లు నా పితుని పాల య్యెనో ఆ యార్తుని రక్షణంబును నట్లే కాఁగలదు.

గంగ—(ప్రవేశించి) 11 పాట

హా! మహాసాధ్వులారా! రక్షించుడు! రక్షించుడు!

(మ్రొక్కును.)

లక్ష్మి—అమ్మా! నీ వెవ్వతెవు. ఎవనినుండి రక్షణమును గోరుచున్నావు.

గంగ—లోకమాతలారా! నేను గంగను. కొందరు మహా పాపులు నా జలంబుల స్నానమాడి తమ కిల్బిష ములచేఁ నన్ను ఖిలముసేయ వచ్చుచున్నారు. వార లఁ బోకార్చి నన్నుద్ధరించుడు. మిమ్ము శరణుఁ జొచ్చి తిని. (చరణముల వ్రాలును.)

పార్వ—(స్వ) ఈ గంగకుఁ దగిన ప్రాయశ్చిత్తము కావల సినదే (నవ్వును.)

నారద—తన సవతి యగుటచే గంగాదేవి దైన్యము పార్వ తికి మనస్సంతోష కరముగ నున్నది కాఁబోలును. (నవ్వుచున్నది.)

లక్ష్మి—గంగా! సకలపాప సంహారిణివైన నీ కేల యీ భీతి. వారి యఘుంబులఁ దూలింపలేక పోయితివా!

గంగ—అయ్యో! ఇందిరాదేవీ! జ్ఞానులయ్యును బుద్ధి పూర్వకంబుగఁ జేసిన సంయమి హింసా పాపముల నంతరింపఁజేయ నా వశమగునా! అయ్యవి నన్నే కలుషితగాఁ జేయఁగలవు. వేగ రక్షించుడు. అల్లదే పాపు లరుదెంచు చున్నారు.

సరస్వ—ఈ ఘోర పాపసంహారము నావలనఁ గాదు.

లక్ష్మి—గంగకు సపత్నియైన పార్వతియే యీ కార్యము సేయవలయు.

పార్వ—నన్నధఃకరించి మగని శిరమెక్కియున్న తన్నుఁ దానే రక్షించుకొనఁ గలదు.

నార—దెప్పిపొడుచుటకుం బార్వతికి మంచి సమయము దొఱికినది.

సరస్వ—నారదా! ఇక నీవరుగుము. లక్ష్మి పార్వతులారా! రండు పోవుదము. మనమేల యీ బెడదల నెత్తిఁ బెట్టుకొన వలయును. (ముగ్గురు నిష్క్రమించెదరు.)

గంగ—12 పాట

నార—గంగా! ఇక్కడికి నీ కార్య మేమైనది?

గంగ—ఏమైనది! గంగపాలే యైనది.

నార—నేను తొలుత చెప్పినట్లు వింటివా!

గంగ—కనకనే యీ సవతిపోటులకు హృదయము వ్రణమైనది.

నార—పొమ్మా! అనసూయ కడకు (నిష్క్రమించును.)

గంగ—

శా॥ శ్రీగంటన్ ద్రిజగంబులన్నినపు లక్ష్మీశారదా దేవులే
యీగంగాశరణంబునొల్లననా కేదారియో! యీశ్వరా
నీగయ్యాళిపడంతిపార్వతినను ద్వేషించి పోపొమ్మనం
గాఁగారుణ్యములేదొపో వ్రదఁగదో! గంగాధరాశంకరా!
(నిష్క్రమించును.)

రంగము—ఆశ్రమము



[అత్రియు అనసూయయుఁ బ్రవేశించెదరు.]

అత్రి—భద్రా! పాతివ్రత్య మహిమ సతులకే కాక యొక్కొక్కప్పుడు సర్వలోక రక్షకమై వెలయుఁజుమి.

18 పాట.

అన—మహాప్రసాదము. సతీమహిమను గుఱించి యింకను వంచిపవలయును.

అత్రి—మంచిది. వినుము.

సీ॥ నిజహృదయాబ్జ కర్ణికయందు ననిశంబు
భర్తరూపంబు నిల్పంగవలయు
త్రికరణశుద్ధి భక్తిని జంచలములేక
పతినామమే స్మరింపంగవలయు
పతివినాయన్య దైవము లేదనుచు వ్రత
స్థితయయి సతము సర్చింపవలయు
వరుఁడెట్టివాఁడైన నిరసింపకాతని
దైవాధికుండంచు దల్పవలయు
గీ॥ ఇట్టుసుపవిత్రచరి ♦ యించుసతుల
మహిమలు జగంబులకు నెల్ల ♦ మండనములు
సత్యమును శౌచమును దాంతి ♦ శాంతి కరుణ
యును మణీమయభూషలౌ ♦ యువిదలకును

అన—మహాభాగ్యము (తెరలో గానము)

అత్రి—అయ్యది నారదసంగీతము కాఁబోలును

నార—(ప్రవేశించును)

అత్రి—దేవర్షులకు నమస్కారములు

అన—నారాయణభక్తులకు వందనములు

నార—మీ పుణ్యదంపతుల కఖండమహీసామ్రాజ్యసిద్ధి కలుఁగుఁగాక! అత్రిమహర్షీ! మీవలన నమస్కార గౌరవమందుటకు నేను తగను మీరు లోకాతీత ప్రభావసంపన్నులు

అత్రి—నారదా! పరమేష్ఠియానతి సంసారశృంఖలములచేఁ గట్టువడి సృష్టిప్రవృత్తిలో మునిఁగిన నేను నిస్సంగుఁడవైన నీచరణధూళీలవమునకుఁ బోలుదునే! నీవు ప్రపంచాతీతుఁడవు కావున నట్లు తలంపకుము.

అన—దేవర్షీ! నీయవికత్థనత్వము నీయున్నతికి భూషణము కదా! ఇదే యర్ఘ్యము స్వీకరింపుము.

నార—అమ్మా! త్రిలోకపావనీ! అర్ఘ్యముగొనినపిదప నాహారము గొనుమందువు. ఆవిషయమున నీనారదుఁడభాగ్యుఁడైనాఁడు.

అన—అదేమి స్వామీ!

నార—ఏమనివచింతునమ్మా! ఈమధ్య నాహృదయమున దుర్భరశూలరోగముప్రవేశించినది. దానినిఁ బోఁగొట్టుకై నేను భక్షించిన వేళ్లు వెల్లంకులు నిన్నియు సన్నియుఁగావు. తుదకశ్వినీదేవతలనడుగ గులకరాళ్ళను సెనగలవలె వేయించి భక్షించినఁ గాని కుదరదని వచింప రాళ్లు శనగలగుటయెట్లు? వేగుటయెట్లయ్యా? అని ప్రశ్నింప (బ్రాతివ్రత్యమా

హాత్మ్యమునఁగాని యొండువలనఁ గాదని వాక్రు
చ్చెను. తల్లీ! అది మొదలీరాళ్ళను మూటగట్టు
కొని పతివ్రతలకడకుఁ దిరిగి వేసరి తుదకు లక్ష్మీ
సరస్వతీపార్వతులకడ కేగి వినిపించితిని వారును
మావలనఁ గాదని వచింపఁ ద్రిలోకపావనివైన నీవ
లన నాకార్యము సఫలమగునని పుట్టెడాసతో
వచ్చితిని.

అన—నారదా! నీవు జగద్విమర్శనమునకు ఒయల్దేరితివా!
నిక్కముగ వ్యాధి నివారణమునకా!

నార—అయ్యో! తల్లీ! జగంబుల విమర్శింప నేనెంతటి
వాఁడను.

అన—అట్లుకాకున్న రాళ్లు చణకములెట్లగును?

నార—ఆమాట నన్నడిగిన నేమిచెప్పుదును. పాతివ్రత్య
ప్రభావమున నగునని యశ్వినులు నుడివిరి.

అన—అట్లయినఁ బాతివ్రత్యమహిమవలన నీశూలనే నివా
రింపరాదా మధ్య నీరాళ్లను చణకములుగఁ జేయు
టేల? వేయించు టేల? అందువలన విశేషమేమున్నది!

నార—(తలవంచి తనలో) ఈప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము
లేదు. ఏమందును దైవమా! కుడిచి కూర్చుండలేక
గాలికిఁబోవు ముండ్లకంపను కాయమునకు దగిలించు
కొని చిక్కుపడుచుంటిని!

అన.—ఏమి నారదా! పలుకవేమి? నీవేమి యోచించుచు న్నావు?

నార—అమ్మా! ఏమని నుడువుదును. ఈప్రశ్నము నాకిప్పుడు తోఁచకపోయెనుగదా యని యోచించుచున్నాను.

అన—నీకిప్పుడు కావలసినది రాళ్ళను సెనగలుగా వేయించుటయా! శూలల నివారింపఁజేయుటయా!

నార—(తనలో) ఈమాట కూపిరియే యాడుటలేదుకదా!

అన—ఏమి పలుకవు.

నార—అమ్మా! నీమహిమవలన శూలల నివారింపఁజేసెదవు నీయాశ్రమము దాఁటి యవలకఱిగిన మరల నాకడుపులోఁ బ్రవేశించి నన్ను బాధించునే మోయని సందేహ ముకఁడు వ్యాధికి జోడైనది. తరువాత తమ చిత్తము.

అన—సందేహము వ్యాధికి జోడైనట్లు యుక్తియు నీభక్తికి జోడైనదే! సరే నీభావము తెలిసినది. ఆరాళ్ళనిటు తెమ్ము. (రాళ్ళను పుచ్చుకొని) జీవితేశ్వరా!

చ॥ అనవరతమ్ముఁ దావకపదాబ్జములన్ భజియించిమిమ్మదే॥
మునిగఁదలంచిమించువర పుణ్యపతివ్రతనైతినేని యో
యనఘచరిత్ర!నారదునియార్తిదొలంగఁగగుల్లరాళ్ళన్
చణకములట్లువేచఁగల శక్తినొసంగవె! నీకుమ్రొక్కెదన్

(పతికి నమస్కరించును)

అత్రి—భద్రా! అభీష్టసిద్ధిరస్తు

అన—(సెనగలదోసిటఁబట్టి) 14 పాట

గీ॥ ధవునినే దేవునిగఁగొల్చు దాననేని।
పూతచరితపతివ్రత నైతినేని।
నారదునికోర్కెదీఱఁగా నాసుమహిమ
నిగులకరాళ్లు సెనగలై వేగుఁగాక॥

(దోసిలి గిలకరించి) నారదమహర్షీ! ఇదే సెనగలుగా వేయించితి స్వీకరించి భక్షించుము. (ఇచ్చును)

నార—మహాప్రసాదము (చేకొనిచూచి యూఁదుచు) ఆశ్చర్యమాశ్చర్యము. సెనగలై యెంతచక్కగ వేగినవి. (భక్షించి) ఆహా! ఎంతకమ్మగనున్నవి తల్లీ! అనసూయాదేవీ! మహాపతివ్రతయన నీకే చెల్లునమ్మా!

సీ॥ సాధ్వీత్వమున సరస్వతినిలక్ష్మిని గిరి
తనయఁబార్వతిఁ దల దన్నినావు।
అన్నపానంబుల నాత్మశక్తినిసృష్టి
చేసియార్తులను రక్షించినావు
పతికాకయన్యదైవములేఁడనుచుఁబల్కి
స్త్రీధర్మములను బోధించినావు
మహిమంబుఁజూపి దిఙ్మండలిఁగీర్తిము
క్తాతోరణంబులఁ గట్టినావు

గీ॥ అమ్మభువనైకరక్షణి! అమలచరిత!
పుణ్యములపోగువునీవయి పుట్టినావు
అత్రిసంయమి పూర్వ పుణ్యమ్ముచేత
విశ్వకర్త్రివి నీవు లభించినావు॥

ఓ మహామహిమాన్వితురాల! అనసూయాదేవి! నీకు వం
దనసహస్రములు నన్నుఁ బవిత్రునిగా నాశీర్వదింపుము.
(నమస్కరించును.)

అన—నారదా! భక్తిసామ్రాజ్యమనుభవించెదవుగాక.

నార—అమ్మా! నీవు జగదీశ్వరివి పరమపావనివి గంగా
దేవిని మించిన పవిత్రురాలవు.

(తెరలో) హా! అనసూయాదేవీ! మాంపాహిమాం
పాహి!

అన—ఆ యార్తురాలెవ్వతెయొకదా! అభయోస్తు.

గంగ—(ప్రవేశించి) మహాత్మురాలా! మాంపాహి మాం
పాహి (పదములఁ బడును.)

అన—15 పాట

అమ్మా! రక్షించెదను నీ వెవ్వతెవు. భయకారణ
మేమి?

గంగ—దేవీ! మహాపాపులు తమ దుర్వార కిల్బిషము
లను స్నానవ్యాజంబున నాయందు సంక్రమింపఁజే
యరాసహింపఁజాలకయభయార్థమై వచ్చినగంగను.

అన—పాతక విదారిణివైన నీకే యీ భీతి కలిగెనా! ఆ
పాపులేరీ.

గంగ—నా వెంటనే వచ్చినారు. ఏ కారణముననో యిం
దుఁ బ్రవేశింపక యాతమాల వృక్షముక్రింద నిల
చినారు.

నార—ఈ పుణ్యాశ్రమ మహిమా విశేషమే వారిని నిరోధించినది.

గంగ—తల్లీ! వేగ వారలఁ బోకార్చి రక్షించుము. త్రిశక్తులకును నిక్కార్యము సాధ్యమైనదికాదు.

నార—నేనీ యంశము మొదటనే చెప్పియుంటిని.

అన—భగవంతా! ప్రాణేశ్వరా! ఇదిహింసాకార్యముకదా!

అత్రి—అయినను దుష్టనిగ్రహ పుణ్యఫలంబులభింపఁగలదు.

అన—జీవితేశ్వరా! తమకుఁ బ్రతికూలించి భాషించితినని తలంపవలదు. దుష్టనిగ్రహమైనను తుదకు హింస లోనే చేరునేమో?

అత్రి—అట్లయిన వారి పాపంబులఁ బోకార్చి పవిత్రులఁ జేయుము.

అన—అట్లు చేయుటకు వరంబిచ్చితిరా!

అత్రి—ఆ వరంబిచ్చితిని.

అన—(కమండలూదకము గైకొని) నా భర్త అత్రిమహర్షి పుణ్య తపోనిధియేని నేను పరిశుద్ధ పతివ్రతనైతినేని యీ మహాపాపులు కిల్బిషములను బాసి పవిత్రుల గుదురుగాక (నీళ్లు చల్లును.)

పాపులు—(దివ్య తేజములతోఁ బ్రవేశించి) మహాత్మురాలా అనసూయా దేవీ! వందన సహస్రములు.

16 పాట.

మహా క్రాటకంబున మహర్షులఁజంపి భక్షించిన మా పాపముల నీ మహిమచేఁ బటాపంచలైనవి. మేమును మునులమయ్యును తామాడంబరమున క్రోధ్వలేక హింసాకార్యమునకుఁ బాల్పడినందువలన మా యఘంబులు గంగాదేవికిని లక్ష్మీ సరస్వతీ పార్వతులకును గూడ నివారింప నలవికానివై నీచేత హరింపఁబడినవి. నీ కరుణచే మేము పునీతుల మగుటయే కాక మా యజ్ఞానములుకూడఁ బాసినవి. ఇది మొదలెన్నఁడు నెట్టి యిక్కట్టులు ప్రాప్తించినను హింస సేయము. నీ సతీమహిమము జగంబుల కలంకారభూతమైనది. తల్లీ! లోకమాతా! అనుజ్ఞయొసంగెదవేని పోయి తపోనిష్ఠలతోఁ గాలమును గడిపెదము.

అనసూ—మంచిది పొండు. గంగా! ఇక నీవు నిశ్చింతగఁ బోవచ్చును.

గంగ—అనసూయాదేవీ!

గీ॥ దివ్య సతులనుమించి పతివ్రతా ప్ర
భావమున సద్యశముగాంచినావు నీవు
నీకు సమమైనసాధ్వి ముల్లోకములను
లేదులేదని దిశలు వేలీల మొఱయు॥

అన—ఆర్యపుత్రుల తపోవిశేషముకాని నా మహిమ సుంతయు లేదు.

గంగ—సుమతివగుటచే నీ సతీమహిమకు నీవు గర్వింపవు.

అనుజ్ఞ గైకొందును.

నార—అహోస్మ సెలవొసంగుము.

అన—మంచిది.

(అందరు నిష్క్రమించెదరు.)



శ్రీ

# అనసూయ

—♦—

## తృతీయాంకము.

### రంగము - ఆశ్రమము.

(కౌశికుఁడును సుమతియుఁ బ్రవేశింతురు.)

సుమతి—(నాధుని ముఖలక్షణములఁ బరిలక్షించి) ఇదేమి? వదనారవిందమువాడువారియు నాకలిదప్పులయందలవు దప్పియునున్న చందంబునఁ గన్పట్టుచున్నది?

కౌశి—ప్రాణేశ్వరీ! అదేమియోకాని నాకునుం దెలియరాక చెప్పశక్యముకాని బాధ యేదియో నాదేహలత నలముకొనియున్నది.

సుమ—దాని కేమి కారణమైయుండునో యోజించి చెప్పఁ బ్రార్థించుచున్నదాన!

కౌశి—దేహజాడ్యమే కాక మనోజాడ్యమును నన్నావరించియున్నట్లు తోఁచెడిని.

సుమ—(వానిశరీరమును స్పృశించి) నాధా! ఇదియేమి? కుమ్మలో నుడికిన తామరతూఁడువోలె మీ మేను దీవ కుతకుత యుడుకుచున్నది. అక్కటా! ఈ జ్వరోద్రేకంబు మాన్పు వెరవూహింపవలయును గదా!

కౌశి—(తాపమభినయించుచు) అబ్బా! ఈబాధ దుర్భరము! ఈతాపజ్వరంబు మంచు నెత్తిపైఁ గట్టుటాదిగాఁగల శైత్యోపచారంబులొనర్చినంగాని కుదుటఁబడునట్లు తోఁచదు. కట్టా! దుర్భరము! దుర్భరము! (తల నొకచేతఁబట్టుకొని వేదననభినయించును.)

సుమతి—(త్వరలో)అయ్యో! ఇంకజాగు సేయుటనుచితము. నామనోనాథుని, నాజీవితేశ్వరుని, నాప్రాణసదృశుని మనోగతాభిప్రాయానుసారముగాఁ దగిన వెజ్జుకడకుఁ గొనిపోయి యారోగనిర్మూలనకు వలయు నౌషధసేవ సేయించెదఁగాక! (నిష్క్రమించును.)

2 వ రంగము—పురబాహ్యసీమ.

(భృగువల్లి ప్రవేశించును.)

17 పాట

భృగు—అన్నన్నా! కాలమెంతక్రూరమైనది! తపోమహిమచే దండధరునంతటివానినిసైతము శిక్షింపఁగల నానాథుఁడగు మాండవ్యమహర్షికిఁ గొఱతశిక్షయా! ఇట్టి దారుణశిక్షను విధించిన యాయముని యాపరప్రభావానభిజ్ఞుని నాయుక్తాయుక్తపరిజ్ఞానశూన్యుని నాధరాధిపుని మదీ[illegible]ద్వారశాపహతునిగ నొనర్చి నాభర్తను శిక్షనుండి తొలంగింతునా! కాదు. కాదు. అట్లు సేయరాదు.

ఎవ్వనికైనఁ బురాకృత సుకృత దుష్కృత ఫలంబు లనుభవింపకతీరదు. అట్టి సంచితకర్మ ననుభవింప వలసియుండుటనే నరపాలుఁడిట్టి శిక్షను విధించియు న్నాఁడు. ఇహమున రాజదండితుఁడైనవానికిఁ బర లోకదండనముండదని పెద్దలు పలుకుచుందురు. ముందిక యేఁడుదినములవఱకును నాభర్త యీబాధ ననుభవింపవలసినదే.

(తెరలో) హా! ఎవ్వఁడవురా! దురాత్మా! శూల మున గ్రుచ్చఁబడిన నాచరణమునకు నీశిరమును దగిలించి బాధనొందించితివి! హా! ప్రాణేశ్వరీ!

భృగు—(లేచి కోపముతో) ఔరా! నానాథునకే శిరో పరిఘాతమా! ఓరోరి దురాత్మా! నిశాచరుఁడా! నిర్భయుఁడవై కన్నుఁగానక కొఱతవేయఁబడిన నా భర్త నీవిధంబుగ బాధకలిగించిన . నీశిరంబు సూర్యోదయమగునప్పటికి సహస్రశకలంబులగుఁ గాక. ఇదే నాశాపము. (జలమును విడచును.)

సుమ—హా! అదృష్టహీనురాలనుగదా! అమ్మా! నీవెవ్వ తెవు. తగిలినంతమాత్రమునఁ దలపగులునట్లు శపిం తువా! తల్లీ!

18 పాట

భృగు—నేను మాండవ్యమహర్షి భార్యను భృగువల్లిని పూర్వదుష్కృతమునంజేసి రాజదండితుఁడై కొఱ తనున్న నాభర్తకు శిరోఘాతంబున బాధగలిగిం చిన వాని శపియించితి. నీవెవ్వతెవు?

సుమ—నేను కౌశికమునిభార్యను సుమతియనుదానను అశక్తుఁడైన నాపతిని శిరంబునఁబెట్టుకొని యావింత వైద్యు నింటినుండి మన్గృహమున కేగుచు దారిదప్పి యీత్రోవనుబడి వచ్చితి. నీభర్త యిందుండుట తెలియక నేనే యాకొఱతక్రిందనుండి వచ్చితి నప్పుడు నీపతి యాక్రందనమునువిని యిం దెవనికో నాపతి శిరముతగిలినట్లెంచి భర్తయున్న తట్ట నందుదింపి వచ్చునంతలో నీవు శపించితివి. తెలియకచేసినపనికై నీవిట్టి దారుణశాపమొసంగు ట పాడికాదు. కావున శాపమును గ్రమ్మరింపుము. నీకు మ్రొక్కెదను.

భృగు—సుమతీ! నీభర్తపై నీకెంతటిభక్తి ప్రేమలుకలవో నావల్లభునిపై నాకును నంతటి భక్తిప్రేమలుకల వని యెఱుంగక నన్నిట్లడుగుట న్యాయముకాదు

సుమ—ఎఱుంగకపోలేదు నీ భర్తకు నా పతివలనఁ గలిగి నదిబాధ యెట్టిదో యట్టిబాధకుఁ దగిన శాపమునే యొసంగవలయుఁ గాని ప్రాణాపహరణ శాప మి చ్చుట ధర్మముకాదు. మఱల్పుమని ప్రార్థించుచు న్నాను. శాంతిఁజెందుము దీర్ఘక్రోధ మెట్టి మహా పతివ్రతా ప్రభావమునైనమట్టుపెట్టును. అందువలనఁ బాప మావహిల్లును. దూర మాలోచించుకొనుము.

భృగు—ఏమైన నగుఁగాక నా దైవము నా నాథుఁ డట్టివా నికిఁ బరితాపము కలిగి నపుడు నేను సహించుదా నను కాను. ముల్లోకములును ముగ్గిపోయినను సరియే నా శాపమును మాత్రము మఱల్పను. నీ భర్త నా శాపమనుభవించియే తీరవలయును. చనుము.

సుమ—(కోపముతో) 19 పాట.

ఏమంటివి! క్రోధ దేవతకుఁ బుట్టి నిల్లైన భృగువంశ మునొక్క దుర్లక్షణమును జక్కఁగ బోషించితివే! భృగువల్లీ! నీ శాపమును మఱల్పవా! నీవే పతివ్రత వనుకొంటివా! ఇంక నెవ్వతెయుఁ బతివ్రత లేదను కొంటివా! జగంబంతయు గొడ్డువోయినదా యేమి? సరే మంచిది. నీశాప మెట్లు నిర్వహించునో చూచెదగాక. ఈ చతుర్దశ భువనమ్ములును కర్మా నుష్ఠాన శూన్యంబులై పాడువడుఁగాక. బహుళాంధ కార బంధురమై సురలు గంధర్వులు యక్షులు సాధ్యులు త్రిమూర్తులు గలిగిన యూర్ధ్వలోక సప్తకము నధోలోక సప్తకము దిశల నెఱుంగక తల్లడమందుఁగాక తమోవారాశియందు మునిఁగిపో వుఁగాక. నాప్రత్యక్షభగవంతుఁడైన నాభర్తకే యరిష్టము సంభవింపనున్నపుడు నేను సహించి యూరకుందుననుకొంటివా! నీవు శపించినది

సూర్యుఁడుదయించువఱకనికదా! నేను నిరంతర పుణ్యమహాపతివ్రతనైతినేని తొలుత సూర్యుఁడే యుదయించకుండుఁగాత. (జలము విడుచును.)

భృగు—ఓహో! సుమతీ! ఎట్టి యార్భాటముం జేసితివి! నీవెట్టి వీరపతివ్రతవైనను సూర్యోదయమునుఁగూడ నిరోధింపఁగలుగుదుననుకొంటివా! ఎంతగర్వమం దుచుంటివి.

సుమ—ఆ! నిశ్చయముగ గర్వమునే వహించితిని.

భృగు—ఈమాటలూరులువిన్న నవ్వుదురుసుమీ!

సుమ—భృగువల్లిశాపము వమ్మైనదని నవ్వుదురుగాక.

భృగు—ఆ! నాశాపము వమ్మగునా!

సుమ—నాశాపమేల వమ్మగు.

భృగు—ఏల వమ్మగునా! నీరజబాంధవోదయమునకు నీలితెర నడ్డువేసినందులకు.

సుమ—అట్లుకాదు. నీశాపమునకనుము.

భృగు—ఆ! నాశాపమునకా.

సుమ—ఆ! నిశ్చయముగ

భృగు—(నవ్వి) ఆహాహా! ఏమి! దంభాలాపములు నీవచన రచన పచనము కానిపనసకాయకూరవలె నున్నది.

సుమ—నీయుదాసీనత నింగిపై నాట్యమాడఁబోయి బొగ్గు లగుంటలోఁ బొర్లపడినట్లున్నది.

భృగు—ఓసీ వాచాటీ! ఏమంటివి! శోకములపాలుగావిం

చెదనుసుమీ!

సుమ—ఆనందము నాపాలు శోకము నీపాలు.

భృగు—నాకు శోకమా! మూఢమతీ!

సుమ—నీకే కాక యంధకారమహార్ణవంబున మునకలు

వేయుచున్న జగములకన్నిఁటికిని శోకమే.

20 పాట

భృగు—ఓసీ! జగదపకారిణీ! అప్పుడే నీశాపము ఫలించి

నదని సంతోషింపకుము.

సుమ—ఫలించినను. అల్లదే చూడుము. శుక్రోదయమైన

నాల్గుగడియలకు సూర్యోదయము కావలసిన నేఁడు

శుక్రుఁడుదయించి యెనిమిదిగడియలైనది. పొద్దు

పొడుచువేళ దాఁటినట్లేనా

భృగు—(నిదానించిచూచి) అవును. ఈమె వచనదో

షముదిననాథునకుఁడగిలినట్లున్నది. (ఆకసముచూచి)

ఇపుడు సూర్యుఁడున్నలగ్నము మేషముకదా!

అప్పుడే కృత్తికానక్షత్రముదయించి జాముకడచి

నది. కావున నాశాపము నష్టపడఁగలసినట్లే. లేదు!

లేదు! రవియెప్పుడుదయించిన నప్పుడే నాశాపము

ఫలింపఁగలదు. (ప్రకాశము) సుమతీ! స్వల్పాపరాధి

యైన నీమగనికి దారుణశాపము నొసంగితినని

యాక్షేపించిన నీవిప్పుడేమిచేసితివో గుర్తెఱిఁగితివా?

సుమ——ఏమిచేసితిని?

భృగు——నీపతి యొక్కనికొఱకై సర్వజగమ్ములఁ జిమ్మ చీకటిలోముంచి క్షోభింపఁజేసిన యఘంబుంగాంచి తివి.

సుమ——నాకుఁ బతియే ప్రధానముకాని జగంబులతోఁ బనిలేదు.

భృగు——అట్లయినఁ ద్రిమూర్తులును సంయములును మన యిరువురిశాపముల ఫలము ననుభవించినారు. ముం దేమికానున్నదో యిక నాభర్త శ్రమ సహింపఁ జనెదను.

సుమ — నేను నాభర్తనింటికిఁ జేర్చవలయును.

(ఇద్దరు నిష్క్రమించెదరు)



# శ్రీ

# అనసూయ

—◆—

## చతుర్థాంకము.

రంగము—గగనము—నారదుని ప్రవేశము.

నార.—అన్నన్నా! ఈ యంతరిక్షమునసైతము దుర్జనుల యపయశోమషీరసంబువోలె నంధకారము బంధురమై కన్నులకు నంధత్వముం గలిగించినదికదా! కలహాభోజనుండనైకటికియుపవాసములుసేయునాకు జంపతుల ప్రణయకలహమనెడు సుంతకొఱ్ఱగంజిని పథ్యమిచ్చినట్లు లీచిమ్మచీకటిలో మునిఁగిపోయిన సర్వప్రపంచమునకును నక్షత్రమండలములకాంతి ప్రసారములేకయుండిన లోకములంతరించెననియే చెప్పనగును. నేనిప్పుడు జీమూతపథంబు నతిక్రమించి పరివహామను వాయుపథంబునఁ జేరియుందునని యీసహజశీతలమ్మైన పిల్లవాయువుల స్పర్శసుఖమువలనఁ దెలిసికొనఁగలిగితిని. వనములయందలిదావాగ్నికీచకగుల్మములనేకాక చందనవృక్షములనుగూడఁ దగులఁబెట్టినట్లు సాధ్వీల శాపకారణమున జనించిన తమోభూతము పృథ్వినేకాక

యూర్ధ్వలోకములఁగూడ దిగమ్రింగునట్లు తోఁచు చున్నది. ఈ భయదాపాటుముందీద్పుడని త్రిమూర్తుల చెంత కరుగవలెనన్న బహుళాంధకారమునను దిగఁబడిన వానివిధంబున దివ్యమైన నాగమనము సాగుటలేదు. పుణ్యావశంబున హరిహరబ్రహ్మలు నాకెదురురాఁగూడదా! అదే ధృవనక్షత్రమును దాఁటితిని.

(హరిహరబ్రహ్మలు ప్రవేశించెదరు.)

హరి—పరమేష్ఠీ! ఏమో మహాంధకారము వ్యాపించి యున్నది. ఈ నభోమార్గసంచారి యెవ్వఁడై యుండును?

బ్రహ్మ—కన్నులకు మిన్నుమన్ను మాసినప్పుడు నోటిమాటచేతనే కదా తెలిసికొనవలసినది. దిశలతో సంభాషించు నోద్యోమార్గసంచారుఁడా! ఎవ్వఁడవు నీవు?

నార—అయ్యలారా! దివ్యులెల్లరును తమ తేజములఁ గారు చీకటిపాలొనరించి యసమర్థులైనప్పుడు దిశలతో సంభాషింపక యేమిసేయుచుందురు. మీరెవ్వరు?

హరు—నారదా! మా కైలాసవైకుంఠ సత్యలోకములును తమోగ్రసితములైనవి. కారణమరయుటకై మేము ముగ్గురమును భూలోకమున కరుగుచున్నాము. నీవెందు బోవుచున్నావు.

నార—ఓహో! హరిహరబ్రహ్మలా! దివ్యరత్నములారా! మీకు వందనము లీకటికిచీకటిలో బంధఁ

బడిన బడుగు దూడవలెఁ దన్నుకొనుచు నేను మీ లోకములకై వచ్చుచున్నాను. కాని మీ యర్థాంగులు లక్ష్మీసరస్వతీపార్వతులు మీవెంటనున్నారా!

బ్రహ్మ—లేరు. వారు నిలయములయందేయున్నారు.

నార—అయ్యో! నాకోరిక నూతఁబడిన చేద అందుబడికి వచ్చియు మరల జాఱిపోయినట్లయ్యెఁగదా!

హరి—భూలోకమున మాండవ్యకౌశికపత్నులైన భృగువల్లీసుమతుల శాపమువలనఁగదా? ఈ దీర్ఘరాత్రి వ్యాప్తి "వజ్రం వజ్రేణ భిద్యతే" అను న్యాయమున మహాపతివ్రతల శాపముల మరలింప మహాపతివ్రతలే సమర్థలనునూహచే లక్ష్మీసరస్వతీపార్వతుల చెంత కఱుగుచున్నాను.

హరు—ఓయీ శాపమొసంగినవారే మరలింపవలయును గాని యన్యులవలనఁగాదు. వారినే బ్రతిమాలుదము రమ్ము.

నార—మహేశ్వరా! ముల్లోకములమించినమహాపతివ్రతలు వారివలననే కాదందురా!

బ్రహ్మ—(తనలో) ఇది నిందాగర్భమైన స్తోత్రము.

హరి—సుమతీభృగువల్లులు మనప్రార్థనల నంగీకరింపరా?

నార—అంగీకరించుట స్వప్నవార్త. ముల్లోకములును మునిఁగిపోయినను సరియే తమభర్తల కేయాపదలు రాకుంటయే వారియభిమతము.

హరు—అందుచేతనే వారివాక్కులయందింతటి మాహాత్మ్యమున్నది.

నార—త్రిమూర్తులారా! నేనొక్కయుపాయముం జెప్పెద వినుండు. అత్రిమహర్షిభార్యయైన యనసూయా దేవినిఁ బ్రార్థించి వారికడకుఁ గొంపోయితిమేని వారివారి భర్తల కెగ్గుకలుఁగకుండంజేసి సూర్యోదయమగునట్లొనర్పఁగలదు. జగంబులకింత తేజోభిక్ష యిడఁగలదు.

బ్రహ్మ—అట్లైనఁ బ్రార్థింతము రండు.

హరి—ఆమె యందంతటి మహిమకలదా?

నార—కలదో లేదో నేనొకనాఁడు గులకరాళ్లను గొంపోయి మీమీ పత్నులసన్నిధికేగి సెనగలవలె వేయించి యొసంగుమన వారు వలనుపడదని వచింపఁ బిమ్మట ననసూయ నాకోర్కె చెల్లించినది కావున నామహాదేవివలన నిక్కార్యమగునని యూహించితిని.

హరు—ఓహో! త్రిశక్తులకుఁగూడ నలవికాని పని యొనరించెనుగా?

హరి—ఎప్పుడో! ఏమిజరిగెనో యాప్రసక్తియిపుడేల? యిప్పు డీవిపత్తును బాపి రవియుదయించునట్లుచేసిన నధికురాలనవచ్చును.

నార—ఒక్కసూర్యునేకాదు. ఆమె తలంచిన వేయిమంది సూర్యుల నుదయింపఁజేయఁగలదు. రండు పోవుదము. (అందరు నిష్క్రమింతురు.)

రంగము—పురోపకంఠసీమ

(భృగువల్లి ప్రవేశము.)

భృగు—21 పాట

నేఁటికి సూర్యుఁడుదయించి యాస్థాంఘంటికాగణన మునుబట్టి యేఁడుదినంబులయినట్లుతోఁచెడిని. సత్కర్మానుష్ఠానభంగములకై యెంతమందిమహర్షులు వంతనొందుచున్నారో కదా! ఇందులకై యూర్ధ్వలోకములును తల్లడిల్లుచుండియుండవచ్చును. ఎన్నిలోకములు తపించుచున్నను కర్మదేవతకరుణవలన నా వల్లభుఁడీనాఁడు శిక్షావిముక్తుఁడు కాఁగలఁడు. ముల్లోకములును మునుఁగుఁగాక మూర్తిత్రియము ముగ్గిపోవుఁగాక. నాపతి వచనామృతమును ద్రావుచు నానందమునను౦డెదఁగాక.

(హరిహర బ్రహ్మ నారదులు ననసూయా సుమతులు ప్రవేశము.)

ఓహో! త్రిమూర్తులును నారదానసూయలు నరుదెంచుచున్నారే! అమ్మా అనసూయాదేవీ! వందనంబులు త్రిమూర్తులకును నారదునకును నమస్కారములు.

అన—అమ్మా! భృగువల్లీ! నీకు భద్రములుకల్గుగాక. తెలియక యీసుమతి యొసర్చిన స్వల్పాపరాధము నకై నీవుగోకినమంటకొఱకై చాపజాతినిఁ దల మీఁదఁ గూల్చినట్లు చేసితివి. ఈసుమతియుఁ దన యొక్క భర్తప్రాణముల రక్షించుకొనుటకై దిక్కులనెల్లఁ దిమిరసముద్రమునఁ గూలఁద్రోసినది.

సుమ—దిక్కులకంటెను త్రిమూర్తులకంటెను త్రిలోకముల కంటెను నాభర్తయే నాకధికుఁడు. అందు నాదోష ములేదు.

అన—ఆమాటసత్యమే. నేనిప్పుడు మీయందు దోషారో పణమును జేయరాలేదు. త్రిమూర్తులును నారదా దులును నేనును మిమ్మిరువురఁ బ్రార్థించి ప్రపం చము నీబహుళాంధకారమునుండి యుద్ధరింపంజేయ వచ్చితిమి. మీమీశాపముల మీరే మరల్పవల యునని వేఁడుచున్నారము.

భృగు—నాభర్తకుఁ జిత్తసంక్షోభకారకుఁడైన కౌశికుఁడు నాశాపములకుఁ బాల్పడవలసినదే నేను మఱలిం పను.

సుమ—నాపతిజీవితమున కపాయకరుఁడైన సూర్యుఁడుద యింపకయే యుండుఁగాక. నేను నంతకంటె సమ్మ తింపను.

బ్రహ్మ—భృగువల్లీ! నీభర్తకుఁగలిగిన బాధ నిముస మాత్రమున్నది. అది మొదలారోగ్యముగనే యున్నవాఁడు. కావున నీశాపమును నీవు మఱలింపవచ్చును.

భృగు—ఎవరుమీరు బ్రహ్మలా! నాభర్తకీదారుణశిక్షా విధిని మొగమున నెందులకు వ్రాసితివో తెలుత వచింపుము.

బ్రహ్మ—అమ్మా! మాండవ్యుని కర్మదేవతయాజ్ఞచే నట్లు వ్రాయవలసినవాఁడను కాను. ఇచ్చవచ్చినట్లు వ్రాయ సమర్థుఁడనా! మీరెఱుంగనిదేమున్నది.

భృగు—ఆయనఘుఁడుచేసిన దుష్కర్మయెట్టిదో వచింపుము.

బ్రహ్మ—బాల్యంబునఁ దూనీగలను పృష్ఠభాగములకుఁ దృణములఁగుచ్చి యాటలాడుట.

భృగు—బాల్యలీలలకింతటి యపరాధములా! ఔరా! పరులనాక్షేపింప నందరును పండితులే తాము చేయునవిమాత్రము తలరాపనిపనులు ఆహా! యీపపంచము మాధ్యదేవతనోటనుండి యెన్నడు బయల్పడునోకదా! సృష్టికర్తవైన నీకును నల్పాధికశిక్షావిధానమవసరములేదేమి. నాకుఁ గావలయునా!

అన—అమ్మా! ఆగ్రహించకుము. శాంతించుము.

భృగు—ఏల శాంతింపవలయును. పరమేష్ఠి చనుము నా పతి మోమున వ్రాసిన తప్పుడువ్రాతను దుడిచివే యుము.

బ్రహ్మ—అమ్మా! శిక్షానిర్ణయకాలము పరిసమాప్తనంది నది. ఇదుగో నీకు గడాలోగ్యవంతుడై నీసన్నిధికి వచ్చుచున్నాడు. (మాండవ్యుని ప్రవేశము.)

భృగు—జీవితేశ్వరా! నమస్కారములు మీకు బాధ యెట్లు న్నది?

మాండ—బాధ యేమియును లేదు. సుఖంబుగనున్నవాఁ డను. నాయందలి భక్తిచే నీవొసంగిన శాపమును మరలించి సుమతికిఁ బతిభిక్షపెట్టుము.

భృగు—భర్తమాటకు వ్యతిరేకించితినని తలంపవలదు. ఇయ్యది ధార్మికవచోరసనయే కాని యెట్లు వంచిన నట్లు వంగుటకుఁ బేపబ్రగ్గ కాదు. నావాక్యము మోఘము. నచోపిఘాతమున మహిమను గోల్పోవవల సియుండును గదా!

అన—అమ్మా సుమతీ! నీవేమందువు.

సుమ—ఆవిషయమున నేను భృగువల్లికంటె నూటయెని మిది పన్నములెక్కువ చదివితిని. చర్విత చర్వణ మేల? నాభర్తక్షేమమే నాకుఁ గావలయు నాశాప మునుమాత్రము మఱల్పను.

అనసూ—నీభర్త క్షేమమేయగును. సూర్యోదయమగు
నట్లనుగ్రహింపుము.

సుమ—ఇనుఁడుదయించిననాపతికాపద మూడకుండు టెట్లు?

అన—నేను సజీవితుఁ జేసెదను.

సుమ—అంతవఱకు వచ్చునుకద! ఆమాట నేను విననొల్ల.

అన—విననొల్లకున్న భర్త యనారోగ్యమునకు సహిం
చెదవా!

సుమ—వినిన నారోగ్యవంతుఁడై దివ్యమంగళాకారుండ
గునా!

అన—ఆ! తప్పక దివ్యమంగళాకారుఁడును పూర్ణారోగ్య
చిరకాలవయోవంతుఁడును నగును.

సుమ—ఇప్పుడున్న శరీరమే యట్లు. మాఱునా? మఱియొక
యుపాధినిఁ గల్పించెదరా?

అన—ఇప్పుడున్న దేహమే యట్లు మాఱును.

సుమ—భృగువల్లి శాపప్రకారమున నుత్తమాంగమునకు
శైథిల్యప్రాప్తి కాదా?

అన—శైథిల్యప్రాప్తియగునుగాని భేదింపఁబడదు.

సుమ—అసువులాయుపాధియందే యుండునా?

అన—అందేయుండును.

సుమ—గుణములుమారునా?

అన—చిత్తచాంచల్యము పోవును. సుగుణము లలవడి
జ్ఞానియగును.

సుమ—అట్లయిన సమ్మతింపవచ్చుఁగాని స్వవచనవ్యాఘాతము సంభవించునేమో.

అన—సంభవింపదు. ఏమందునా! నీవు తొలుత శాపమొసంగినప్పుడు "నాభర్తకే యనిష్టము ప్రాప్తించునెడల సూర్యుఁడే యుదయించకుండుఁగాత" అని వచించితిని. నీభర్తకే యనిష్టము రాకుండ మేము రక్షించి యొసంగెదము.

సుమ—నాభర్తను రక్షించునంతటిమహిమ నీయందున్నప్పుడు మీరే సూర్యోదయమగునట్లు సేయరాదా!

అన—అట్లే చేయఁగలను కాని యట్లుచేసినచో భృగువల్లి శాపము ఫలించును. అందువలన నీమనంబునకుఁ బరితాపము కలుగఁగలదు. కావున సర్వజనక్షేమంకరముగ మిమ్ముఁ బ్రార్థించియే కార్యగతిని నెఱపఁదలఁచి వచ్చితిమి. అంతియేకాక నీశాపమును మరల్పఁగలశక్తి నాయందున్నదని నేనుడువఁజాలఁ గావున సూర్యోదయమున కనుజ్ఞనొసంగుము.

సుమ—మహాత్మురాలా! పిమ్మట నీవు నాపతిని సంరక్షింపఁగలవో లేవోయని సందేహించుచున్నాను.

త్రిమూర్తులు—సందేహమవసరములేదు. విధిగా సంరక్షింపఁగలదు.

అన—అమ్మా సుమతీదేవి!

చం. కమలహితోదయంబయిన కాలమునం దెత్వదీయవల్లభుం
డసువుల శరీరముఁ బాయుచునిను నారయవచ్చెడు నమ్మ నాదువా
క్యములు ధృవంబులౌ; నటులు కాక తలంగిన శింశుమారచ
క్రము తలక్రిందుఁగాదె! త్రిజగంబులు దివ్యులు నిల్వనేర్తురే॥

(తెరలో) సత్యము. సత్యము.

సుమ—మహాభాగ్యము (చేతులు జోడించి) స్వామీ!
పద్మినీవల్లభా!

గీ॥ నా విభుం డిప్డు సన్న్యాయముం గాశకేసు
డగునటులు ధాత్రిఁ జీకటుల నంతరింపఁ
బద్మినుల కెల్ల హర్షంబు వఱలునటుల
ఇనసుహాశయ! రవి! యుదయింపవయ్య॥

అన—గీ॥ సాధ్వి భృగువల్లిశాప వశంబుచేతఁ
గౌశికున కెట్టియాపద కలుగకుండ
మామకీన పాతివ్రత్య మహిమ సతము
శ్రీయముఁ జిరాయువొసఁగి రక్షించుగాత॥

బ్రహ్మ—అదిగో భగవానుఁ డుదయించినాఁడు జగంబు
లుద్ధరింపఁబడినవి.

సుమ—అల్లదే నా నాధుఁడు దివ్యతేజముతో మనయెడ
కరుదెంచు చున్నాఁడు.

కౌశికుఁడు—(ప్రవేశించి) త్రిమూర్తులకును మహా సాధ్వు
లకును నమస్కార శతంబులు! తల్లీ! అనసూయా

దేవీ! నీ కరుణామృత వర్షధారచే పూర్వజన్మ కర్మ పరిపాకంబునఁ గలిగిన యనారోగ్య కష్టమును బాసి దివ్యశరీరుండనై యచ్చిరజీవితము గలవాఁడ నైతిని. సుజ్ఞాని నైతిని నీ మహిమంబు దివ్యసన్నుతంబు.

సుమ—మహానంద సాగర తరంగ డోలికల నిప్పుడూగుచున్నాను.

అందరు—22 పాట (అందరు నిష్క్రమించెదరు.)

రంగము—మందిరము

[లక్ష్మీ సరస్వతీ పార్వతుల ప్రవేశము.]

సరస్వ—లక్ష్మీ పార్వతులారా! అలనాఁడు నారదుఁడు మనము సెనగలఁజేసి వేయించలేని శిలల ననసూయ తన పాతివ్రత్య మహిమచే వేయించి భిక్షయిడినదని వచించినది మొదలు నాకు మనంబున సహంభావమను వహ్ని యుదయించినది పిమ్మట ననసూయ యీ యంధకార ప్రళయము మాన్పించి కౌశికున కారోగ్య చిరజీవిత్వ మొసంగినదను వాక్యము వినినది మొదలు రగిలి విజృంభించి నా హృదయము నేర్చుచున్నది. మీ మీ మనంబు లెట్లున్నవో వచింపఁజాల.

లక్ష్మి—అగును నాకును సట్లేయున్నది. గోవిందుండా యనసూయమహిమను వేనోళ్ళఁ బొగడుచుండ నాయొడలు చిటచిట లాడినది. ఏమి సేయుదును?

పార్వ—ఆమెయున్నతిఁ బొగడునపుడు నాభర్త శివుండు విశ్వమునిండిన వచోధోరణిచే నాచెవులు చిల్లులు వడఁజేసినాఁడు.

సరస్వ—అట్లు చేసినప్పుడు వేక్షించితివా! ఏమన్నరాలా! నీ మహాకాళీత్వ మెచటి కేగినది.

పార్వ—ఎచటి కేగినదా! మచ్చునకైన లేకుండ మటుమాయమైనది. "విశ్వమునిండిన" అని నేను మున్నె వచించితినికదా!

లక్ష్మి—మనసతులకున్న బుద్ధి మాంద్యమే యిది! సమయము వచ్చినప్పుడు వాచాలత లేక యవల మనలో మనము గొలగొలలాఁడుకొందుము. దానఁబ్రయోజనమేమున్నది?

సరస్వ—ఇప్పుడైనను మించలేదు. మనము ముగ్గురము నొక సూత్రమున నడిచితిమేని ననసూయమహిమ నింతలో నట్టాకలఁ బెట్టవచ్చును.

లక్ష్మి—మించలేదా! అదేదో చెప్పుమా! వాణీ!

పార్వ—వేగవచింపుమా శారదా!

సరస్వ—మనభర్తలను మనయిష్టానుసారముగ నడిపించుకొను ప్రౌఢతనమువహించిన నిముసములో సాగును

లక్ష్మి—నాభర్త శౌరి నామాటను లక్ష్యము సేయఁడు.

పార్వ—ననుఁగాదని గంగను నెత్తి నెక్కించుకొనిన పశుపతిమాత్రము నాపలుకాలకించునా!

సరస్వ—నాకావిధమైన యవమానము లేదుసుఁడీ!

లక్ష్మి—లేదు కాని మన మిపు డేమిచేయవలయునో వచింపుమా!

సరస్వ—మనపతులు మాఱువేసములతోఁ బోయి యామె పాతివ్రత్యమును భంగపఱచునట్లు చేయవలయును.

పార్వ—ఆమె శపించిన!

సరస్వ—బాగుబాగు! ముందుగనే మంగళాష్టకములును సంకల్ప దారిద్ర్యములునా! నావల్లభు నెట్లో సమ్మతి పఱచెదను.

లక్ష్మి—నేనును నాపతిని నెట్లో సమ్మతింపఁజేసెదను.

పార్వ—తొలుత సమ్మతించుటయే కష్టముకాని తొల్లి దారుకావనమునిపత్నుల సాధ్వీత్వమును భంగించిన యలవాటు నావరుఁడగు శివునకు హస్తగతమై యున్నది.

సరస్వ—అట్లయిన నికేమి! ముందు నాభర్తను మీపతుల సన్నిధికిఁ బంపెదను. మీ రింతలో వారిని సమ్మతింపఁజేయుఁడు. పిమ్మట మువ్వురు నేకమై పోవచ్చును. అంతియే కాని యామెయున్నతిని మనపతులు పొగడుటయు మనము సహించుటయునా! చాలుజాలు! సిగ్గుసిగ్గు!

23 పాట

(అందరు నిష్క్రమించెదరు.)

రంగము— అత్రిమహాముని యాశ్రమము.

(3 సాధువులు ప్రవేశించెదరు.)

1 సాధు—సాధువులారా! అదే అత్రిమహర్షి యాశ్రమము సాధువేషములతో వచ్చిన త్రిమూర్తులమని యామె . గుర్తింపకుండ మనము ప్రవర్తింపవలయును. స్తుతిగీతములఁ బాడుచుఁ బ్రవేశింతము.

2 సాధు—సరే-24 పాట

(అత్రియు ననసూయయుఁ బ్రవేశించెదరు)

అత్రి—సాధుపుంగవులారా! మా వందనముల స్వీకరించి యాతిథ్యమును గైకొనుఁడు.

అన—మాయాశ్రమమును బావనము సేయవచ్చిన త్రిమూర్తులారా! వందనములు.

3 సాధు—(తనలో) ఈమె మమ్ము గుర్తించెనేమో కదా! (ప్రకాశముగా) సాధ్వీమణీ! మమ్మంతటివారితోఁ బోల్చిన సహింపఁజాలము. మీ దంపతులకు భద్రంబులు కలుగుఁగాక.

అత్రి—మహానుభావులారా! నాయర్ధాంగియనసూయ తమ కాతిథ్యమొసంగును. స్వీకరింపుడు నాకనుష్ఠానమునకు వేళయగుచున్నది. చనియెదను.

2 సాధు—అనసూయాదేవి సర్వజ్ఞురాలు మాకెందును గొఱతలేదు. చనవచ్చును.
అత్రి—చిత్తము—(నిష్క్రమించును.)
అన—సాధులారా! కందమూలఫలాదుల భక్షించెదరా శాల్యోదనసూపాదుల నారగించెదరా?
3 సాధు—మహాదేవీ! నీవు సంకల్పసిద్ధురాలవు. ఏదియైన ను సమకూర్పఁగలవు—శాల్యోదనమైనను సరియే
1 సాధు—ఘృతసూపాదులతోనైనను స్వీకరించుటకు వా టుకలదు.
2 సాధు—భక్ష్యభోజ్యములతోనైన మఱియు నానందము.
అన—భక్ష్యభోజ్యములతోడనే యారగించెదరుగాక.
1 సాధు—కాని... ... ...మాకొక... ... ... ...
అన—సందేహింపక యదేదో వచింపుడు. స్వాములారా!
2 సాధు—ఒకనియమమున్నది.
అన—ఆనియమమేదో వచింపుడు. అట్లే యొనర్చెదను.
3 సాధు—ఇదే వ్రాసినార మీ పత్రమును దిలకింపుడు. (పత్రిమొసంగును.)
అన—(పత్రిముచూచి చదివి నవ్వి) ఆహా! ఈవిధంబుగ భోజ్యముల వడ్డింపవలయునా? (ఆలోచించి) సరే మీరు స్నానాదికములఁ దీర్చుకొని రండు. వంటచేసి సిద్ధపఱచెదను.
1 సాధు—అందు వ్రాయఁబడిన విధానము మీకు సమ్మత మేనా?

అన—తొలుత సమ్మతించి మరల కాదంట వాచాదోషం బుగదా! స్నాతలై రండు (సాధువులునిష్క్రమిం చెదరు.)

25 పాట.

వీరు నా పాతివ్రత్యమునకుఁ గళంకముఁ కలుగ జేయ వలయునను తలంపుతో వచ్చిన హరిహర బ్రహ్మలు గుర్తించి శపింతురేమోయను భీతిచేఁ గైతవ సాధు రూపములతో వచ్చియున్నారు. నా మహిమోన్న తినిఁ జూచి యోర్వఁజాలక సరస్వతీ లక్ష్మి పార్వ తులు దుర్బోధనములుసేయ భార్యలమాటలు పంచ దార పేటికలుగ భావించి యిట్టి యనార్య కార్య మునకుఁ దలయొగ్గి యుందురు. ఇది నిశ్చయము త్రిమూర్తులుకాదే త్రింశత్కోటి దేవతలైనను నా వ్రతభంగము జేయఁజాలరు. అగుఁగాక వీరల నా మంత్రోదకంబులఁ బ్రోక్షించి పసిపాపలఁ జేసి వీరు కోరినట్లు వివస్త్రనై పదార్థముల వడ్డించెదఁగాక

(సాధువులు ప్రవేశించెదరు.)

అయ్యలారా! స్నానాదికములైన రండు వడ్డించెదను.

1 సాధు—చిత్తము. (అనసూయ సాధువులతో నిష్క్ర మించును.)

అత్రి—(ప్రవేశించి) దేవీ! అనసూయా! ఏమి సేయుచు న్నావు.

(తెరలో) పిల్లలకు బువ్వము లాలగింపఁ జేయుచు న్నాను.

అత్రి—ఆ పిల్లలెవ్వరు? అతిథు లెందుబోయిరి? ఈవలకు రమ్మా.

[పిల్లలతో ననసూయ ప్రవేశించును.]

అన—ప్రాణేశ్వరా వీరే విచిత్రపు టతిథులు వీరే విష్ణూ రపుఁ బిల్లలు.

అత్రి—అదేమి యాశ్చర్యము! అతిథులే యీ యర్భకులా! ఎందుల కిట్లైరి.

అన—కోరరాని కోరిక కోరినందున (ప్రశ్నించుచున్నారు.)

అత్రి—(పతి ముఖము చూచి నవ్వి) బాగుబాగు నీ వదృష్టవంతురాలవు. పసిపాపలను తొట్టెలోఁ బరుండఁబెట్టి జోకొట్టితిరమ్మా?

అన—మహాప్రసాదము. (పిల్లలఁ గొంబోయి విడిచి మరల వచ్చును.)

అత్రి—అనసూయా? అసూయ కడుఁ జెడ్డదికదా! త్రిశక్తులను సైతము దుష్పథమున నడిపించినది.

(లక్ష్మి సరస్వతీ పార్వతులు ప్రవేశించెదరు.)

త్రిశక్తులు—హా! అనసూయా మహాదేవీ! రక్షించుము శరణార్థినులము. (చరణములఁ బడుదురు.)

26 పాట.

తల్లీ మా యజ్ఞానము మన్నింపుము. పతిభిక్ష యొసంగుము. నీ చరణములఁబట్టి వేఁడుచున్నాము.

అనసూ—అమ్మలారా! మీ రెవ్వరు! పతిభిక్షయన నేమి! నే నందుకు సమర్థురాలనా!

సరస్వ—తల్లీ! జగదతీతమహిమామతల్లీ! రక్షించుము. మేము లక్ష్మి సరస్వతీ పార్వతులము నిశ్చయముగఁ దమ వ్రతభంగము గావింప మా భర్తలకు దుర్బోధనములఁ జేసి పంపించిన నసూయాపిశాచగ్రస్తలము. మా పతులను మఱల యథారీతిగ నొనరించి మాకుఁ బతిభిక్షల నొసంగుము. మాకీ ప్రాయశ్చిత్తము చాలును.

లక్ష్మి—అమ్మా! నీ పుణ్యచరిత్రమును బుష్పమువలె శిరములను నీ పావన పాదధూళిని హస్తాంజలిని ధరించెదము. మీరు శిశువులుగఁ జేసిన మా పతులకుఁ బూర్వరూపముల నొసంగి యనుగ్రహించుము.

పార్వ—మహా పతివ్రతా శిరోమణీ! అతి హేయమైన మా యకృత్యమును మన్నించి భర్తృభిక్ష యొసంగుము.

నార—(ప్రవేశించి) నే నిపుడు సతీమహిమయం దెంతటి విలువయున్నదో తెలిసికొంటిని. 'అమ్మా అనసూయా దేవీ! శరణన్నవారల రక్షించి నీ సతీ మహిమాపతాకను త్రిలోకములకు నలంకారముగఁ బ్రతిష్ఠించుము.

అనసూ—(లోపలకు నీళ్లుచల్లి) త్రిశక్తులారా! వారే మీ పతులు యథాకృతులఁగాంచినారు.

(హరి హర బ్రహ్మలు ప్రవేశించెదరు.)

త్రిమూర్తులు—27 పాట.

తల్లీ! మా యపచారముల మన్నించి రక్షించుము.
అత్రిమహర్షీ! అనుగ్రహించుము.

అనసూ—త్రిశక్తులారా! త్రిమూర్తులారా! రక్షించితిమి. మీ మీ పశ్చాత్తాపములే మీకుఁ బ్రాయశ్చిత్తములు మఱియు

గీ॥ ఆత్మతేజంబు హరియించు నపయశంబు
పెచ్చుపెఱుగును సాహసమ్ము మచ్చుమాయు
నఘముఁ జేకూర్చుఁ గనసూయ యాగుణంబు
తగదు తగదెట్టివారికి జగతిలోన

త్రిమూర్తు—తల్లీ! మా కివన్నియు ననుభవములోనికి వచ్చినవి. మా పాపంబులఁ బరిహరింపఁ జేయుము.

అనసూ—అట్లయిన మీరు మువ్వురును నాకుఁ బుత్రులై యుదయించుడు.

త్రిమూ—మహాభాగ్యము! మా త్రిమూర్తుల యంశలును గలసి నీ గర్భమున వేదమయుఁడైన దత్తాత్రేయుఁ డను బుత్రునిగ నుదయింతుము.

అందరు—28—పాట.

నార—తల్లీ! జగత్పావనీ! పతివ్రతామతల్లీ!

గీ॥ వర పతివ్రతలనుమించి వరలినావు
మూడుమూర్తులకంబవై మురిసినావు
నీయశోద్యుతి దిశలందు నిలిపినావు
శ్రీ సతీమహిమను బ్రతిష్ఠించినావు॥

అయిన నీ కింకేమి కావలయును?

అనసూ—నా భర్త్రనుగ్రహము కాక నా కేద్దియు నవ
సరము లేదు. అయిన నిట్లగుంగాక

గీ॥ వసుధ యనుకూలసస్యయై పండుంగాక
స్త్రీలు పతిభక్తిగలిగి చరింత్రుగాక
చంద్రకళలట్లు మాణిక్యశర్మకృతులు
సకలజనులకు హాయి యొసంగుంగాక॥

అందరు—తథాస్తు. తథాస్తు.

మంగళం మహాః శ్రీ శ్రీ శ్రీ

ఇది

శ్రీ చక్రావధానుల వంశపయః పారావార రాకా
సుధాకర నారసింహశర్మ తనూభవ నర్సమాంబా
గర్భ శుక్తి ముక్తాఫల శ్రీ వేంకట
సుబ్బరాయ గురు కరుణాలబ్ధ సాహిత్య
శ్రీ మాణిక్యశర్మ ప్రణీతంబైన అన
సూయా నాటక సర్వము
చతుర్థాంకము

# సంపూర్ణము

## —♦ ఈ నా ట క ము న వ చ్చు పా ట లు ♦—



అన—1 పాట.

(ఏలా! ఈచిత్రశాలా! అనువరుస)

ఓహో! యీ తేజానే లా! యీలీలా॥ ఎందూలా కేగునో॥
ఓహో॥

(1) నామదిలోపాల ప్రేమమిూలీలా! ప్రాభవించుట కేదిఁ కారణమౌనో, లోచనామృతముగురిపించేగా॥ఓహో॥

(2) విభునీలోచనకళలిటు। వెడలియేమియౌనో।నాకె। కాక యీ।లోకమోనమై।ఆకర్షించేగా ॥ఓహో॥

అత్రి—2 పాట.

(వెడలుము వెడలుము సముఖము అనువరుస)

(1) అలయక।సొలయక।నిలువుముసాధ్వీ। ఏటిభ్రాంతియిదిఁ యేగకుమా॥చానాశ్రమపాల్పడిపోవందగునా।అలకాంతులచేర్చ జనునా!చాల్ చాలికరా।చనఁగవలదురా॥అల

అన—3 పాట.

(ఆనందమాయెగా॥ అనువరుస)

ఆనందమాయెగా।నాకుసూనుఁడుదయించెనె ॥ఆ॥

(1) సురుచిర।సుకళాలవాలు।సుందరశోభితకపోలు। సూరిజనవిలోలునాదు।చూలుసాధుశీలు।గాంచ॥ నానందమా॥

(2) హిమరుచి।బాలుపారుసూను।ఈప్సితసత్ఫలనిధాను।శౌరిసుతునమానుశాంతభాను।భూరిపుణ్యగాంచ ॥ఆనంద॥

అత్రి అన—4 పాట.

(ధన్యుడనైతినితాపస॥ అనురువస)

సంతసమాయెను।సారససంభవ।సుతుగృపనొసగన్। మే మాహో ॥సం॥

తపములు।పండెను।తమకంబారెను। ॥సంతస॥

(2) అమృతమరీచిగ।సలవరిచినమీ।యతిదయకెంతయు।కు తుకముగలిగెను।అనఘాసీకృప। తనయుని। గాంచిన।సు కృతులమైతిమి।స్తుతులఁగాంచుమి ॥సంత॥

(3) కరమాహ్లాదంబుకల్గె।సురుచిరవరిశంబువెల్గె।సకలౌషధి నాథునిగా। సలుపనెంచినాడవుగా।మనుపుమీ। తనయు నా।నందముఁ।జెందగన్ ॥సంతస॥

అత్రి అన—5 పాట.

(పాండవేయులార;॥ అనువరుస)

ఈకుమారచంద్రుడు।గాని।ఏలుమోవిధాతా॥ఈకుమార॥ ఆశ్రితఫలదాతా।యో।ఆగమనుతిభ్రాతా।ఈతుహినాం శునినీతను।జాతుండ।నిడెంచుమా।దివిజలోకపాల। యిం కెవరు।ప్రాపుమాకికన్ ॥ఈకుమార॥

అన—6 పాట.

(సకలలోకపాలులార॥ అనురుసస)

(1) శ్రితజనావనాత్ములారా! మరీచ్యాదులగు మహాత్ము లారా!ఓత్రిమూర్తులారా ॥శ్రి॥ హృదయతాపమెదో। యేచెడుఁకటకట।కరుణనేలరేభరింపరే ॥శ్రిత॥

(2) భరింపంజాల।యీవ్యధకు నేను।సరగ। బోవదగు।నాద రంబునన్।పుణ్యమూర్తులారా। శాశ్వత। మహోపకారు లారా।శమదమగుణాంకశీలులారా। శ్రీకరుడౌనాపాణే శుడె।గతిగ।గొల్చునను బరమసాధ్వి।రక్షణ మొనరింపుడు ॥శ్రీత॥

7 పాట. కథలో వ్రాయబడినది.

నారదు—8 పాట

(1) భజగోవిందం।భజగోవిందం।గోవిందంభజమూఢమతే॥ భజగోవిందం॥సంప్రాప్తేసన్నిహితే కాలే। నహినహిరక్షతి డుకృఞ్।కరణే ॥భజగోవిందం॥

(2) స్మరలక్ష్మీశం।స్మరలక్ష్మీశం।లక్ష్మీశంస్మర।మూఢమతే ॥స్మరలక్ష్మీశం॥ సంసారేసన్నిహితాపాయాం। జహి జహి ఈశంస్మరమూఢమతే ॥భ॥

సరస్వ—9 పాట.

(కన్నులారగాను॥ అనువరుస)

కన్నులారమిమ్ము। గనంగ। గల్గెగా। నాదు ॥కన్నులార॥ గనంగగల్గెగా।ఆనందమాయెగా ॥క॥నేడునాగృహంబు మీ।నీడవిలసితంబు।రారెదమాపూరించి।రావే శ్రీపార్వతీ రావే।లక్ష్మీసతీ ॥కన్నులార॥

నార—10 పాట.

(సారసాక్ష నీచరణ॥ అనువరుస)

శాంతినొందుడీ!।సదమల చరితలు॥సైపగలదె ధాత్రి।మీ కినుకా సైప।గలదెధాత్రి।శ్రీతరుణీ!।విధిరాణీ। పుణ్యాపు

రాణీ। వేదవాణీ।ఆగ్రహములమానీ॥ప్రేమగని।యీాయ

ఖిలముపైని।దయరానీ।హితవాణి! ॥శాంతి॥

(2) వాదులవేలా!। వందితశీలా!। పౌరుషమదియేలా। మీాద

యారసము।చిల్కి జగములా।బ్రోవరదేలా। శ్రీతరుణీ।శివ

రాణీ! ॥శాంతి॥

౫౦౫—11 పాట.

(జగధీశా।నా।కేదదార్॥ అనువరుస)

సతులారా।పుణ్యాత్ములారా॥సతులారా॥కలుషాత్ముల్ననూ

ఖిలముసేయ।గా।ఎంచిరి। యేలుడు। మించుదయా॥ సతు

లారా॥

(2) అధికపాపులా। ఆగడమీాగతి। అడరగ భయం। బంది

యుంటిరయొ।మీాకృపబరపీ।వ్యాకులమడపరె।స్నానవిధు

లగలు।మమునసుజేరెడు।హా।హా।మనఃపసమయమిదె॥సతు

లారా॥

౫౦౫—12 పాట.

(ఈసీతాకై మీారీలీలా॥ అనువరుస)

ఏలాగారె।వ్వారి వేళా।నాగతి।యేదయ్యో॥ఈపాపులనా

వలదరుమంగల। మహిమల।గాంచిన। సతులెవరో ఏలా

రారే॥

(2) ఈగతివంతర!న్నేసెపగ। నేవారి। పవిత్రమహత్వంబయి.

నర!గాపాడనేరదయో।ఎట్లుసహించెద ॥ఏలా॥

అత్రి—13 పాట.

(నాపూర్వపుణ్యఫలము॥ అనువరుస)

శ్రీసాధ్వీ పుణ్యమహిమ। సేవింపావే। భాగ్యరేఖావి
లాస। మెంతయున్నదో। నీమనంబున ॥శ్రీసాధ్వీ॥

(2) లోకంబుల మనుపవచ్చు। వో కార్పవశమౌను। కామి
తమ్ము। బొందందగు। కాంతున్మది భజియించిన। పొం
దరానిభాగ్యమహిమ। పొందదగు స్త్రీలకిలా ॥శ్రీసా॥

అన—14 పాట

(కమలముఖ్యా రామభజన॥ అనువరుస)

విబుధనుతా వేడెద వరమీయుమా। ప్రాణనాయకా!
నేనీశిలలా। వేచఁగ। సెనగల సేయూ ॥విబుధ॥

నీయూమేయూ। మహిమూనాకూ। నీయూవే ప్రాణేశా॥

అన—15 పాట

(వలదిక నాసోదరి॥ అనువరుస)

వగవకుమాఁ స్వాంతమునందీ యెడ। రక్షించెదనిన్నున్
అభయంబొసగితి। అపకారంబెవ రాచరించెనది తెలుప
గదే। తలపగదే। నాశక్తినిదే ఖేదంబును విడువుమి।
స్వాంతమునా ॥వగ॥

(2) తృణలీలల్। దుంగింతుఁ। దయవారఁ। నినుగాతున్॥
కొండలమందక। నీగతి తెలుపుమి ॥వగవ॥

పాపులు—16 పాట

(నాలోకరుణాసామి॥ అనువరుస)

సాధ్వీజననీ। నీమాహిమా। సన్నుతింపగలమే। బ్రహ్మో
దృతైనతగునే। మహాలోక మాతవుకదే ॥సాధ్వీ॥
మహాపాపంబుల్ మడసె।నీమహిమాధాత్రివెలసే।సురల్
పూలవానలుకురిసే। అహోనీయశంబుమలసే ॥సాధ్వీ॥

భృగు—17 పాట

(కనుగొజూచినన్ గొని॥ అనువరుస)

కుటిలధాత నాపతికి। కొఱతచే శిక్షఁజేసె నెట్లోర్చెద॥
హామహేశ దీనబంధు।అనుచునుఘోరముగను।అడలంగ
నేనెటుల। సైచుదాన శ్రీగౌరి శాంకరీ। ఆదరింపుమా
పతిబాధన్! మాన్పుమమ్మ దాసురాల దయ వీక్షింప
గదే యీగదవె। వరమును ॥కుటిల॥

సుమతి—18 పాట

(ఎంతమోసగించెన్॥ అనువరుస)

ఇంతతీవ్రరీతిన్।విభునిశపియింపనెంచె।శాంతింపుమా॥ఇంత॥
కొఱతనున్ననీ। మనోవిభుఁ గనకుండ చనుటనా। య
నుచితమౌకద ॥ఇంత॥

(2) నాయపరాధము। నకుమది సయిచుమి। శాపమున్మర
ల్పుమమ్మ శాంతిలి। మనుపుమాదయగనుమా। దయా
భరణవటంచునిన్ను। దలచెదసుమ్మా। పతిభిక్ష యొసం
గదగుఁ ప్రార్థనము। నాలకింపుశ।మింపుమదినిక ॥ఇంత॥

సుమతి—19 పాట

(చూచెదనా దాని నైచెదనా॥ అనువరుస)

కావరమా। యింత తీవరమా। ఇదిగో వినుమా। నాయ
నుపమ మహిమన్। నీదగు శాపము వ్యథయగునట్టుల।
సూర్యుని। గిర్యుని।యూపఱ నలిపెద ॥కావర॥

(2) భానుండే యుదయించకుండనటు। నాప్రతిశాపము సే
యుఁజుమానిన్నుఁ। నీలోగలశక్తిఁ। గిక్తిన్ అలబ్ర
హ్మనైన,నైతునా, వెఱతునా ॥కావర॥

సుమ—20 పాట

(అధార్మికుల॥ అనువరుస)

జగంబు మహాదం। ధకారమగ్నము। నగానిజెందగగా
వింతుఁ॥ ప్రిభాకరుడేలశుభోదయమా। మదీయవచో
శాపమ్మునసేడే। భయంకరమ్ముగ ॥జగంబుమ॥ తీవ్రిత
గా। తిమిరస్తోమముగా। లోకముభీతిలగా। నలిపెదచూ
చెదుగా। యీసుమతీసతి।పుణ్యసము త్సేకచు।నీదుశక్తిన్
బొలియజేయుగద ॥జగం॥

భృగు—21 పాట.

(ఆహాహారామునిసుగు॥ అనువరుస)

ఆహాయీలోకముతిమి। రాంభోనిధిలోబడిక। లోలత
గాంచెను। దిశలెరుగక విపదాప్తిఁ ॥ఆహా॥
రవియుదయము। గనకీనిశి। ప్రవిదారుణనిర్ఘమాచు

నొంచెదములోకాతీత। సుమతియశోవిభవంబు। వినుతింప
గ। జెల్లునపృథి। వీసతులనమేటియా। సంచునాడుశాప
మెటులు। నగునోహాదైవసూ ॥నేడాహా॥

అందరు—22 పాట.

(రామభజనమేయిహా॥ అనుసరుస)

నీదుమహిమమే। నిఖిలలోకముల। నేలజాలునే। ఓతరుణీ
నీపవిత్రసత్కథాసుధామధు। నిఖిలసేవ్యమే। అన
సూయా ॥నీదు॥

(2) సాధ్వీకులమునీచరణసేవలను। శక్తిగాంచునే యోరమణీ
అతిమహానిపూర్వపుణ్యసంగతి। అటనైతివే। యోరమ
ణీ ॥నీదు॥

(3) నీవెగ్రహములా। నియతిచారమును। నిర్ణయింతువే ఓ
లలనా। నీవెధాత్రి సద్యశోధనంబును।నిలుపనేర్తువేఅన
సూయా ॥నీదు॥

సరస్వ—23 పాట.

(చాలుచాలింకనియుప॥ అనుసరుస)

ఏలచాలింకసిగ్గుపాప్తించెగా। దానికోడిపోతిమి। యెట్టు
లోమునిసతిని। శ్రమలపఱచి। మహాత్వంబుగ। హరింప
గవలెను ॥చా॥

లక్ష్మి—

ఊరకయా। తీరుగనా। డగగునె। వంచనమును సల్పం
దగుగా॥

పార్వ—

నాపతిశంకరునిఁ। బంపించెదనే। నాయమ। తొల్యంబును గాంచా॥

లక్ష్మి—

నాపతిమోహాకృతులన్। గాంచినమది। కామవికృతిగన దగు। సాధ్వీత్వము। దొఱఁగును। జడియకుడిదె। వినరె। ధృతిగనరే। తరుణీ ॥ఏలచాలిం॥

సాధు—24 పాట.

(రామరామరఘురామ॥అనువరుస)

దేవదేవమహా। దేవపరాత్పర। భావజసంహార। భవశూరా। నిషంగశరనిధి। వృషాధివాహన। యుమారమణ సాంబా। హరా ॥దేవ॥

(2) వేదసంస్తుతవిషాదవిభంజన। విశ్వమయాత్మక। విబుధేనా అహీనభూషణ। మహాత్మపాలన। శరణ్యగిరిజామోహనా ॥దేవ॥

అనసూ—25 పాట.

(ఏమికతమోతల్లీ॥ అనువరుస)

నానియమమూ। వెరా। పూని చెబుపా ॥నానియ॥ ఈత్రి మూర్తులును। యీయఖిలంబూ। నేకమయినను। గలప సాధ్యమే॥ నారోషధ్వనియే। వారిఁదునిమెదు। నామృదుభాషయే। వరమైమనుచూ। ఐఱంగనిమెద। మెటు లొనర్తురో ॥నాని॥

త్రిశక్తులు—26 పాట.

(మన్నింపుమా దేవీ అనువరుస)

రక్షింపుమా। దేవీ। రక్షింపుమా॥ భర్తృభిక్షా। నిడుమా
సాధ్వీరో। పాపులమైతిమి। పైపుముతల్లీ ॥రక్షింపు॥
(2) మున్నరకమునను। ముదితోరో। యీగతి। నిన్నుఁ గావంచ
న। సలుపగ గడగక। యీయనమతిమా। కయ్యొజాలుని
క। ఏలుమబలానసూయ కరుణాచే ॥రక్షింపు॥

త్రిమూర్తులు—27 పాట.

(జగన్మోహనప్రభావ॥ అనువరుస)

పవిత్రాధ్యాత్మ! ప్రభావ!। నమామి। ప్రణవస్వరూ
పిణీ। పరాశక్తి ॥పవి॥ త్రిగుణములుంబీ। జగములు। బ్రో
వఁగ। డిగినమహామహిమాశోభితవై ప్రకృతినిమగ్నుల
మమునాడించుచు। బ్రోచుచుందు వీవనిశము। జననిరో॥

త్రిమూర్తులు త్రిశక్తులు—28 పాట.

(శుభాకార శ్రీరామ॥ అనువరుస)

శుభాకారశీలా అనసూయాసతీ॥ మహాసాధ్వులందీవె
మాణిక్యవతా ॥శు॥ సమస్తంబు నీచేప్రశస్తంబగున్।
రమాముఖ్యలన్మించి। రంజిల్లెదా ॥శుభా॥

